పార్లే

# రామ్, శ్యామ్ గ్రహాంతర వాసితో ముఖాముఖి

























నోరూరించే· మనసుదోచే· ఘుమఘుమలించే

పార్లే పాపిన్స్



మీరు కొన్నారా? మీరు చదివారా?

# వనిత

నవంబర్ సంచిక

## దీపావళి విశేష సంచికగా

వెలువడింది.

ఈ సంచికలో...




పోటీలో బహుమతి పొందిన ఆరు కథలు

వినోదమూ, విజ్ఞానమూ కలిగించే

అంశాలతో కొత్త శీర్షిక—కదంబమాల

హైద్రాబాదు చంచలగూడా జైలులోని

నేరస్థుల కథలు—ప్రారంభం!

1500 రూపాయల బహుమతులతో

వంటల పోటీ ప్రకటన!

కళాశాల విద్యార్థినులకు వ్యాసరచన పోటీ!

పురుషులకు కథల పోటీ! లేడీస్ మాజిక్!

మళ్లీ మీ ముందుకు వస్తున్న బామ్మగారి పేజీ!

వర్ణ చిత్రాలలో—శ్రీ వెంకటేశ్వరస్వామి, పుట్టిన రోజులు,

పిల్లలకు కథ, వంటలు, చేతి పనులు...

భానుమతీరామకృష్ణ—'వినోదవాణి'

ఇంకా

మీకు నచ్చిన రెండు నవీన నవలలు—వాసిరెడ్డి సీతాదేవి-'విరాగీతం'

కె.రామలక్ష్మి 'అన్నల్లారా నా తప్పేమిటి?'

మీరు మెచ్చే మరెన్నో విశేషాంశాలతో వెలువడింది.



ఎక్కువ పేజీలు గల ఈ సంచిక వెల... ఐదు రూపాయలు మాత్రమే!

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1989 జనవరి నెల సంచికలో ప్రకటింపబడును.



S. B. Takalkar



S. M. Dudhediya

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ నవంబర్ నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

### సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: నిత్యకృత్యానికి

రెండవ ఫోటో: నిరీక్షణ ఎందుకో?

పంపినవారు: పి. సత్యనారాయణ, తాడికోట, రాజమండ్రి (ఆం. ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.




Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# మీ పాపాయికి
# అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి, పాలతోపాటు ఘన పదార్థాలు కావాలి. సెరిలాక్ లాభాన్ని అందించండి.

పోషకాహార లాభం : సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు, ప్రోటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళల్లో వున్నాయి.

రుచి లాభం : పాపాయిలకు సెరిలాక్ రుచి ఇష్టం.

సమయం ఆదా లాభం : సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ, పంచదార వున్నాయి. దానిని వెచ్చటి నీటితో కలిపితే చాలు.

ఎంపిక లాభం : ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ, తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ, డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.



6 మాసాలు నించి



4 మాసాలు నించి



6 మాసాలు నించి

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి. సెరిలాక్
పోస్ట్ బాక్స్. నెం 3
న్యూ ఢిల్లీ 110008




## సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం

RK SWAMY/FSL/5112/TEL




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''పాము-మనిషి'']కి ఆధారం, వీరేపల్లి జయరాంరెడ్డి రచన. మనిషి మనుగడకు అవసరమైన ధనార్జన రకరకాలుగా సాగినప్పటికీ, స్వయంగా శ్రమించి సంపాదించడంలో ఎంతో తృప్తి, ఆనందం ఉంటాయి. ఇతరులు పడ్డ శ్రమా, ధనం నష్టపోయినా ఓర్చుకోగలడు కాని, తాను పడిన శ్రమకు తగిన ఫలితం లభించకపోతే మాత్రం మనిషి భరించలేడు. ఈ విషయం ''శ్రమవిలువ'' అన్న కథలో, చక్కగా వివరించబడింది.

## అమరవాణి

లుబ్ధమర్థేన గృహ్ణీయాత్, స్తబ్ధమంజలి కర్మణా,
మూర్ఖం చందామరోధేన, యాథాతథ్యేన పండితమ్.

[ధనంతో లోభినీ, వినయంతో కఠినుల్నీ, పొగడ్తతో మూర్ఖుల్నీ, సత్యంతో పండితుల్నీ వశపరచుకోవచ్చు!]

సంపుటి 83 నవంబర్ '88 సంచిక 5

విడి ప్రతి : 3-00 : : సంవత్సర చందా : 36-00

CHITRA

# కొత్త హార్లిక్స్ బిస్కెట్స్.
# కొంతమంది మంచి రుచి నిపుణులు యిలా అంటున్నారు...
















హార్లిక్స్ బిస్కెట్స్

ఇప్పుడు

రుచికరమైనవి, పాలతో నిండినవి, మరియు సంపూర్ణమైన హార్లిక్స్ మంచితనం.

HTA 5456 TEL

# చందమామ కబుర్లు



## కుజగ్రహంలో ఎవరైనా వున్నారా?

వైకింగ్ వ్యోమశాస్త్ర విభాగంవాళ్ళు తీసిన ఫోటోలు, కొన్ని జటిలమైన ప్రశ్నలకు దారితీస్తున్నవి. ఆ ఫోటోలలో కుజ గ్రహం ఉపరితలంలో, బ్రహ్మాండమైన పిరమిడ్ల వంటి రూపాలు కనిపిస్తున్నాయి. ఇవి సహజంగా ఏర్పడ్డాయా లేక ఎవరైనా నిర్మించారా? అన్నదే ప్రధాన ప్రశ్న.



## ప్రపంచంలోకెల్లా ధనవంతుడు

జపానుకు చెందిన యోషియాకీ ట్సుట్ సుమీ పలు రైల్వేలకు అధినేత. ఒక సర్వే ద్వారా, ఈ సంవత్సరం ప్రపంచంలో అందరికన్నా అతడే ధనవంతుడని తేలింది.



## నత్తల పోటీ

స్పెయిన్‌లో ఇటీవల నత్తల మధ్య ఒక పోటీ ఏర్పాటు చేశారు. ఈ పోటీలో 79 నత్తలు పాల్గొన్నాయి. వాటికి కట్టిన రాళ్ళను లాక్కుపోవడమే పోటీ. హెర్క్యులస్ అనే నత్త ఈ పోటీలో ప్రథమ బహుమతిని సాధించింది. 240 గ్రా॥ బరువుగల రాయిని, పదినిమిషాలలో ఈ నత్త 42.5 సెం.మీ. దూరం లాక్కుపోయింది. ఈ పోటీలో కొన్ని నత్తలు రాళ్ళను లాగడానికి బదులు, వాటి మీదికి ఎక్కసాగాయి.



## చైనాబాలిక సరికొత్తరికార్డు

చైనాకు చెందిన షాన్ యిన్‌మెయ్ అనే 15 సంవత్సరాల బాలిక బరువెత్తడంలో సరికొత్త ప్రపంచరికార్డు సృష్టించింది.

# సందేహనివృత్తి

పార్వతమ్మ అనే ఇల్లాలికి ఒక సందేహం కలిగింది. "అసలీ ప్రపంచంలో పోట్లాటలెందుకు వస్తాయి?" అన్నది ఆమె సందేహం. ఆమె తన సందేహం తీర్చమని చాలామందిని అడిగింది. కాని, ఎవరూ సంతృప్తికరమైన సమాధానం చెప్పలేక పోయారు.

ఒకనాడు పొద్దున భిక్షమడగడానికి వచ్చిన బైరాగిని, "స్వామీ, ఈ ప్రపంచంలో పోట్లాటలు రావడానికి కారణమేమిటంటారు?" అని అడిగింది పార్వతమ్మ.

"భిక్షం అడుగుతూ వుంటే, పెట్టడం మాని, ముదనష్టపు ప్రశ్న అడుగుతావేమిటి మూర్ఖురాలా?" అన్నాడు బైరాగి కోపంగా.

"నేను అడిగింది ముదనష్టపు ప్రశ్నా? ఊరూరా తిరిగి బిచ్చమెత్తుకునే ముష్టివెధవా, నీకింత నోటిపొగరా?" అంటూ పోట్లాటకు దిగింది పార్వతమ్మ.

"నేను ఒక్క చెడ్డమాట అన్నందుకే నీకెంత ఆగ్రహం వచ్చిందో చూశావా తల్లీ! మనుషుల మధ్య పోట్లాటలు రావడానికి ఎన్నో కారణాలు; వాటిలో ముఖ్యమైనది నోటిదురుసుతనం. ఈ విషయం నీకు అనుభవపూర్వకంగా తెలియజేయడానికే ఆ మాట అన్నాను. నన్ను క్షమించు తల్లీ," అన్నాడు బైరాగి.

—బి. రఘురామరాజు





# అద్భుతపానీయం

ధర్మగిరిని పాలించే రాజు, భద్రావతీ రాజైన భానుచంద్రుడికి సామంతుడు. ఒకసారి పొరుగున వున్న జయంతపుర రాజైన విజయవర్మ, ధర్మగిరి మీద దాడి చేసి, దాన్ని ఆక్రమించుకున్నాడు. ఈ వార్త కొంత ఆలస్యంగా భానుచంద్రుడికి చేరింది.

ఆయన పెద్ద సైన్యంతో వెళ్ళి, విజయవర్మను ఓడించి, ధర్మగిరిని తిరిగి తన సామంతుడికి అప్పగించాడు. ఆ సమయంలో సామంతుడు, భానుచంద్రుడికి ఒక పెద్ద పీపాను బహూకరించి, "మహారాజా, యిందులో ఒక అద్భుతమైన పానీయం వున్నది. దీన్ని మీరూ, మీ పరివారమూ సేవించి, నాకు ఆనందం కలిగించండి!" అని కోరాడు.

పీపాలో వున్న పానీయాన్ని రాజు భానుచంద్రుడూ, ఆయన సైనికులూ తాగి, మైకం కమ్మి, ఒళ్ళు తెలియని స్థితిలో చిందులు వేసి కొంతసేపటికి మత్తుగా పడిపోయారు.

మరుసటి రోజు బారెడు పొద్దెక్కాక, భానుచంద్రుడు, సామంతుణ్ణి పిలిచి, "నువ్వు మాకు బహూకరించిన పానీయం ఎక్కడినుంచి తెప్పించావు?" అని అడిగాడు.

రాజు అడిగినదానికి, సామంతుడు చాలా సంతోషించి, "మహారాజా, దీన్ని ధర్మగిరిలోనే తయారుచేస్తాం. ఇక్కడ వున్న ఒక జాతి చెట్లనుంచి అది లభ్యమవుతుంది. తమ సంగతేమో తెలియదు గాని, తమ సైనికులు మాత్రం దాన్ని సేవించడంవల్ల, రాత్రి స్వర్గంలో విహరించాం అంటున్నారు," అన్నాడు.

"అలాగా!" అని భానుచంద్రుడు తల ఊపి, "ఈ పానీయాన్ని మీ తండ్రి,

మల్లవరపు మనోహరరెడ్డి



తాతలకాలంనుంచి ధర్మగిరిలో వాడుక చేస్తున్నారా?'' అని అడిగాడు.

''లేదు, మహారాజా! ఈ అద్భుత పానీయాన్ని, రెండు సంవత్సరాల క్రితం, ఒక విదేశీవర్తకుడు, నాకు బహూకరించాడు. నేను సేవించగా ఎంతో ఆనందం, ఆహ్లాదం కలిగింది. అప్పుడు, ఆ వర్తకుణ్ణడిగి, దాన్ని తయారుచేసే పద్ధతి తెలుసుకున్నాను,'' అన్నాడు సామంతుడు.

భానుచంద్రుడు ఒకటి, రెండు క్షణాలు మౌనంగా ఊరుకుని, ''నువ్వు చెప్పేది రెండు సంవత్సరాల క్రితం మాట. ఆ తర్వాత ఏం జరిగిందో వినాలని వున్నది. కాస్త వివరంగా చెప్పు,'' అన్నాడు.

అందుకు, సామంతుడు చెప్పిందేమంటే—

విదేశీవర్తకుడిచ్చిన అద్భుత పానీయాన్ని తాగిన సామంతుడికి, ఒక ఆలోచన వచ్చింది. ఇంత గొప్పసుఖాన్ని కలిగించే పానీయాన్ని, తన ప్రజలకు ఉచితంగా పంచిపెట్టి, వాళ్ళచేత కీర్తింపబడాలనుకున్నాడు.

ఆయన వెంటనే మంత్రిని పిలిపించి, ''ఈ పానీయాన్ని రోజూ, ప్రజలకు పంపిణీ చేయాలనుకుంటున్నాను. దానికి అవసరం అయిన వస్తువులనూ, మనుషులనూ సిద్ధం చెయ్యండి!'' అని చెప్పాడు.

వారం రోజుల తర్వాత ఆయన, కూడలి ప్రదేశాలలో ఉచిత పానశాలలు ఏర్పాటు చేయించి, ఆ అద్భుత పానీయాన్ని ప్రజలకు అందుబాటులోకి తెచ్చాడు. వెయ్యి పీపాలతో ప్రారంభమైన, యీ పంపిణీ, కొద్ది రోజుల్లోనే పాతికవేల పీపాలకు మించిపోయింది. ఇందుకోసం అదనంగా ఏర్పాటయిన మనుషులకు జీతభత్యాలూ, పీపాల రవాణా ఖర్చులూ కలిసి, నెలకు నూరు బంగారునాణాలకు దాటిపోయింది.

ఈ అదనపు ఖర్చుల సమస్యకు పరిష్కారం ఆలోచిస్తున్న, సామంతుడికి, మరొక సమస్య ఎదురైంది. అదేమంటే;

కోరినంత పానీయం యివ్వలేదని ప్రజలు ఆగ్రహించి, ఒకనాడు యిద్దరు పానశాల ఉద్యోగులను హత్య చేశారు.

ఈ విషయం గురించి సామంతుడు, మంత్రితో సంప్రదిస్తే, ఆయన వెంటనే, యీ పానీయాన్ని నిషేధించమని సలహా యిచ్చాడు. అయితే, సామంతుడు, ఈ పానీయానికి ఎంతో కొంత ధర నిర్ణయిస్తే, ఖజానారాబడి పెరగడమే కాక, డబ్బున్నవాడే పానీయాన్ని తాగ గలడనీ, అందువల్ల యీ హత్యలు కూడా అరికట్టవచ్చనీ ఆలోచించాడు.

ఆ మర్నాడే, అద్భుతపానీయానికి ధర నిర్ణయించబడింది. చిత్రమేమంటే— ఉచితంగా పంపిణీ చేస్తున్నప్పుడు, రోజువారీ ఖర్చు పాతికవేల పీపాలైతే, యిప్పుడు ఆ సంఖ్య యాభైవేల పీపాలకు పెరిగింది. ఆదాయం కూడా లభించసాగింది.

సామంతుడు, యీ అదనపు రాబడితో, సంక్షేమపథకాలు నిర్వహించ దలిచాడు. మొదటి ఆరునెలల రాబడినీ, అనాథ బాలల కోసం, ఆ తర్వాత ఆరు నెలల రాబడినీ, సైనికుల వేతనాలను పెంచడం కోసం వినియోగించదలిచాడు. అనాథ బాలల సంఖ్యను వివరిస్తూ, ఒక నివేదిక తయారయింది. వాళ్ళ సంఖ్య పదివేలు.

సంక్షేమ పథకాన్ని అమలులో పెట్టి, ఆరునెలల తర్వాత వచ్చిన నివేదికను, సామంతుడు పరిశీలించాడు. అనాథ బాలల సంఖ్య యిప్పుడు పాతికవేలని





తెలింది. ఇందుకాయన ఆశ్చర్యపోయి, మారువేషంలో నగరసంచారానికి బయలుదేరాడు.

సామంతుడికి వీధులనిండా బిచ్చం ఎత్తుకుంటున్న అనాథబాలలు ఎందరో కనిపించారు. ఆయన, వాళ్ళను ఎందుకు బిచ్చం ఎత్తుకుంటున్నారని అడిగాడు.

''అయ్యా, యీ దేశపురాజు అమ్మిస్తున్న పానీయం తాగి, మా పెద్దలు కొందరు చనిపోయారు. మరి కొందరు అంతు తెలియని రోగాలతో బాధపడుతున్నారు. ఇంకొందరు, ఆ పానీయానికి బానిసలయి, మమ్ములను సాకలేక ఇళ్ళ నుంచి తరిమేశారు,'' అని చెప్పారు అనాథబాలలు.

తర్వాత సామంతుడు, సైనికుల వేతనాలు రెట్టింపు చేసి ఆరునెలల తర్వాత వాళ్ళ స్థితిగతుల మీద నివేదిక కావాలని మంత్రిని అడిగాడు.

అందుకు మంత్రి, ''మహారాజా, సైనికుల భార్యాబిడ్డలు మీకు సమర్పించిన పాతికవేల ఫిర్యాదులు చదివితేచాలు, కొత్తగా వేరే నివేదికలు అక్కర లేదనుకుంటాను,'' అని ఫిర్యాదులకట్టలు తెప్పించాడు.

వాటిలో ఒకటి, రెండు ఫిర్యాదులు చదవగానే సామంతుడికి, సైనికులు పానీయానికి దాసులై వేతనంలో నుంచి ఒక్క దమ్మిడీ కూడా ఇల్లు చేర్చడం లేదని తేలింది.

పరిస్థితి గ్రహించి, సామంతుడు చాలా బాధతో, మంత్రిని, ''ప్రజల సుఖం కోసమని, ఆ అద్భుత పానీయాన్ని తయారు చేయించాను. ఎందుకిలా అయింది!'' అన్నాడు.

మంత్రి వినయంగా, ''ఇప్పుడు జైళ్లలో వున్న ఖైదీల సంఖ్య, మునుపటిలా మూడు వేలు కాదు; యాభైవేలు. వాళ్ళల్లో సగంమంది పానీయం కొనడానికి డబ్బు లేక నేరాలు చేస్తే, మిగిలిన సగంమందీ, పానీయం తాగిన మత్తులో నేరాలు చేశారు,'' అని చెప్పాడు.

సామంతుడు జరిగిందానికి కలత చెంది, "నా మనసేం బాగా లేదు. ఆస్థాన గాయకుడు కపిలశర్మతో కచేరీ ఏర్పాటు చేయించండి," అన్నాడు.

ఎంతో నీరసించిపోయి వున్న కపిల శర్మ వచ్చి, పాడడం ప్రారంభించాడు. పాట కర్ణకఠోరంగా వున్నది. ఆయన పాట ఆరంభిస్తే, వినేవాళ్ళు ఊపిరి తీసుకోవడం కూడా మరిచిపోతారని ప్రతీతి.

సామంతుడు ఆశ్చర్యపోతూ, "ఏమైంది ఆయనకు?" అని మంత్రిని అడిగాడు.

"ఇదంతా, ఆ పానీయం మహిమే. ఎందరో మేధావుల్ని, యీ పానీయం సర్వనాశనం చేసింది!" అన్నాడు మంత్రి.

ధర్మగిరి సామంతుడు, రాజు భానుచంద్రుడికి యింతవరకూ చెప్పి తల వంచుకున్నాడు.

అంతా విన్న భానుచంద్రుడు, "రాజ్యం యిలాంటి దుస్థితిలో వున్నది గనకే, జయంతపురరాజు విజయవర్మ తేలికగా ఆక్రమించుకోగలిగాడు. నువ్వనే, అద్భుత పానీయాన్ని తక్షణమే నిషేధించు!" అని సామంతుడికి చెప్పి, తన రాజధానికి తిరిగి వచ్చాడు.

అయితే, నెల తిరక్కుండానే విజయవర్మ మరొకసారి ధర్మగిరిని ఆక్రమించినట్టు భానుచంద్రుడికి వార్తవచ్చింది. ఈసారి ఆయన విజయవర్మను పారదోలే ప్రయత్నం చేయకుండా, ఒక పథకం ఆలోచించి ఊరుకున్నాడు. అయితే, తన వేగులను జయంతపుర రాజ్యానికి పంపాడు.

వాళ్ళు, ఆరునెలల తర్వాత తిరిగి వచ్చి, ధర్మగిరి సామంతుడి అద్భుత పానీయం, విజయవర్మ రాజ్యానికి పాకిందనీ, ఆ రాజ్యం అల్లకల్లోలస్థితిలో వున్నదనీ రాజుకు చెప్పారు.

వెంటనే భానుచంద్రుడు సైన్యంతో బయలుదేరి, సునాయాసంగా జయంతపురరాజ్యాన్ని ఆక్రమించి, అద్భుత పానీయం పేరుతో చెలామణి అవుతున్న మహమ్మారిని పూర్తిగా నిషేధించాడు.





# వికటించిన వరాలు

పెద్దాపురం అనే గ్రామంలో, వరాలమ్మ దేవత గుడి వుండేది. గ్రామ ప్రజలందరూ, ఆమెను గొప్ప మహిమలు గల దేవతగా, ఎంతో భక్తి శ్రద్ధలతో కొలిచేవారు. భక్తులు యిచ్చే ముడుపులకు తగినట్టు, వరాలమ్మ వారివారి కోరికలు తీర్చేది. ఆ గ్రామ రైతులు పొలాలకు వెళ్ళేటప్పుడు, తమ పంట కాపాడమని ఆమెకు భక్తితో దణ్ణం పెట్టేవారు. ప్రతి సంవత్సరం జాతర సమయంలో, తమ రాబడిని బట్టి, తమ శక్త్యానుసారం హుండీలో డబ్బువేసేవారు.

ఒక ఏడు, సూరన్న అనే ఎరువుల వ్యాపారి, ఆ గ్రామంలో స్థిరపడేందుకు వచ్చాడు. ఆయన వరాలమ్మ మహిమలు గురించి విని, గుడికి వెళ్ళి, ''తల్లీ, యీ గ్రామంలో వ్యాపారం చేద్దామని వచ్చాను. ఈ గ్రామంలోని పొలాల్లో, నా ఎరువులు విరివిగా వాడేటట్టు చేశావంటే, వచ్చే జాతరకు నీకు వెండి తొడుగు సమర్పించు కుంటాను,'' అని మొక్కుకున్నాడు.

వరాలమ్మ చాలా సంతోషించింది. ప్రతి సంవత్సరం ఎరువుల అవసరం లేకుం డానే పండేపంటలు, ఆ సంవత్సరం ఎన్నో ఎరువులు వేస్తేగాని పండలేదు. పొలాల్లో భూసారం తగ్గిపోయిందని, రైతులందరూ విచారపడ్డారు.

ఈ విధంగా, రైతుల ఆదాయం తగ్గి, ఎరువుల వ్యాపారి సూరన్న ఆదాయం పెరిగింది. సూరన్న మొక్కుకున్నట్టు గానే, వరాలమ్మకు వెండి తొడుగు చేయిం చాడు. ఆమె ఎంతగానో ఆనందించింది.

ఆ మరసటి సంవత్సరం, గ్రామానికి సుబ్బయ్య అనే కొత్త వ్యాపారి వచ్చాడు. పొలాలలో తెగుళ్ళకు క్రిమి సంహారక మందులు అమ్మడం, సుబ్బయ్యపని.

బి. వకుళ

అతడు కూడా, వరాలమ్మ మహిమల గురించి విని, గుడికిపోయి, వినయంగా వరాలమ్మకు దణ్ణంపెట్టి, "అమ్మా, నా తెగుళ్ళమందులు ఈ గ్రామంలో బాగా అమ్ముడుపోతే, నీకు యీ ఏడు బంగారు వడ్డాణం చేయిస్తాను," అని మొక్కుకున్నాడు.



వరాలమ్మ, సుబ్బయ్యను అనుగ్రహించింది. దాని ఫలితంగా, ఆ సంవత్సరం, పెద్దాపురంలో పంటలకు విపరీతంగా తెగుళ్ళు సోకాయి. రైతులు ఎరువులే కాక, పెద్ద మొత్తాలలో తెగుళ్ళ మందులు కూడా కొన్నారు. సుబ్బయ్య, వరాలమ్మకు సంతోషంగా బంగారు వడ్డాణం చేయించాడు. వరాలమ్మ ఎంతో సంబరపడింది.

అయితే, వారంరోజుల తర్వాత, ఒక రాత్రివేళ ఆమెకు, వెంకన్న అనే రైతు పిల్లపాపలతో సహా గ్రామం వదిలిపోతూ కనిపించాడు. ఆ గ్రామంలోని అందరు రైతుల్లాగే, వెంకన్న కూడా వరాలమ్మ భక్తుల్లో ఒకడు.

వరాలమ్మ, అతడు భార్యాబిడ్డలతో ఎక్కడికి వెళుతున్నాడో తెలుసుకునేందుకు, ఒక వృద్ధస్త్రీ రూపంలో, అతడి రెండెడ్ల బండికి ఎదురువెళ్ళి, "ఇంత రాత్రివేళ పిల్లపాపలతో సహా ఎక్కడికి వెళుతున్నావు, నాయనా?" అని అడిగింది.

అందుకు వెంకన్న, "పట్టణంలో కూలి పని చేసుకునేందుకు వెళ్తున్నానమ్మా! వ్యవసాయంలో చాలా నష్టాలు వస్తున్నాయి. నా పొలం అమ్ముకుని, గ్రామం వదిలిపోతున్నాను," అన్నాడు.

ఆ సమాధానం, వరాలమ్మకు కొంచెం బాధ కలిగించినా, తన బంగారువడ్డాణం కేసి చూసుకుని వూరుకున్నది.

క్రమంగా గ్రామం వదిలిపోయే రైతు కుటుంబాల సంఖ్య పెరిగి, నెల తిరిగే సరికి సగం గ్రామం ఖాళీ అయింది. వరాలమ్మకు రోజూ దణ్ణాలు పెట్టేవాళ్ళ

సంఖ్య క్షీణించిపోయింది. అయినా వరాలమ్మ సంతృప్తిగానే వున్నది.

అయితే, ఒకనాడు సూరన్నా, సుబ్బయ్యలు కూడా గ్రామం వదిలిపోతూ వరాలమ్మకు కనిపించారు. ఆమె ఆశ్చర్య పోతూ, వాళ్ళకు ఎదురు వెళ్ళింది.

సూరన్నా, సుబ్బయ్యలు ఆమెతో, "అవ్వా, మేం ఎవరిమో తెలుసుగదా! గ్రామంలో మా వ్యాపారం అంత లాభ సాటిగా సాగడం లేదు. అందుకే, మరొక గ్రామానికి పోతున్నాం," అన్నారు.

ఆ మాటలు విన్న వరాలమ్మ కోపం పట్టలేక, తన నిజస్వరూపంతో వాళ్ళకు కనిపించి, "ఒరే, నీచులారా! అబద్ధాలాడ డానికి, మీకు సిగ్గులేదా? భూసారం తగ్గడం, తెగుళ్ళూ—యిదంతా మీ వ్యాపారం బాగా సాగేందుకేగదా చేశాను," అన్నది.

సూరన్నా, సుబ్బయ్యలు ఆమెకు ఎంతో భక్తిగా వంగి నమస్కరించి, "తల్లీ, నీవన్నది నిజమే! కాని, నువ్వు మా మీద వున్న అపారమైన కరుణవల్ల, గ్రామంలోని సామాన్యరైతుల మొర పెడ చెవినిపెట్టావు. వాళ్ళంతా వ్యవసాయంలో నష్టపోతున్నారు. ఇక మా ఎరువులు గానీ, మందులుగానీ ఎవరికి అమ్మగలం? అందువల్ల, మేము పొరుగూళ్ళో వున్న పైడమ్మగుడికిపోయి, ఆ తల్లికి దణ్ణం పెట్టుకుని, ఆ ఊళ్ళో వుండేందుకు పోతున్నాం," అన్నారు.

ఘనమైన ముడుపుల లోభంలో పడి, తను గ్రామానికి ఎంత నష్టం కలిగించిందీ, వరాలమ్మకు అర్థమైంది. తన వరాలు యిలా వికటించగలవని, ఆమె ఊహించలేదు.

ఇంత జరిగాక, ఆమె పశ్చాత్తాపపడి, పంటపొలాలకు ఎప్పటిలా భూసారాన్ని కలిగించి, తెగుళ్ళబాధ లేకుండా చేసింది. క్రమంగా గ్రామం వదిలిపోయిన రైతు కుటుంబాలన్నీ తిరిగి గ్రామం చేరాయి. వరాలమ్మ దేవతగుడి పూర్వం లాగా వచ్చేపోయే భక్తులతో కళకళలాడింది.






# 13

[దేవత నుంచి వరాలు పొంది, ముని ఆదేశం ప్రకారం వినోదుడు, జ్ఞానభూమిగుండా బంగారులోయ రాజ్యం చేరుకున్నాడు. అతడు తన వేలి ఉంగరం తీసి బంగారు విగ్రహానికి పెట్టగానే—విగ్రహానికి ప్రాణం వచ్చి, పీఠంమీది నుంచి నవ్వుతూ దిగివచ్చి పక్కన నిలబడి, ఇరువురికీ వివాహం పూర్తయిందని చెప్పింది. వినోదుడు పరమానందం చెందాడు. —తరవాత]

వినోదుడు కొంతసేపు మౌనంగా ఊరుకుని, ఆ తరవాత, ''మానవప్రపంచానికి అవతల నేనొక యువరాణిని చూశాను. నువ్వు ముమ్మూర్తులా ఆమెలాగానే ఉన్నావు!'' అన్నాడు.

''నువ్వు పాటపాడడం నేర్పిన యువరాణి; నీ కళ్ళముందరే అదృశ్యమైపోయిన యువరాణి గురించేనా నువ్వు చెబుతున్నది,'' అన్నదామె.

''అవును, అది నీకెలా తెలుసు?'' అని అడిగాడు వినోదుడు.

"నిర్జీవమైన విగ్రహానికి ప్రాణం వచ్చిందంటే, ఆ ప్రాణం మరెక్కడినుంచో ఆ విగ్రహంలోకి వచ్చి ఉండాలి కదా? నువ్వు చూసిన ఆ యువరాణి ప్రాణమే నాలో ఉన్నది!'' అన్నదామె.

''అలాగా!'' అన్నాడు వినోదుడు పట్టరాని ఆనందంతో.

మనోజ్ దాస్



"ఈ తామరపుష్పాన్ని ఒక్కసారి వాసన చూశావంటే అసలు నువ్వెవరివో నీకు తెలిసివస్తుంది," అంటూ ఆమె తన చేతిలోని తామరపుష్పాన్ని వినోదుడికి అందించింది.

అతడు ఆ పువ్వువాసన చూశాడు.

మరుక్షణమే—కొండమీది అందమైన రాజప్రాసాదంలో యువరాజు బంగారు విగ్రహాన్ని చెక్కడంలో నిమగ్నమైవున్న దృశ్యం అతని మనోనేత్రాల ముందు మెరుపులా మెరిసింది. తనూ, ఆ యువరాజూ ఒక్కరే అన్న విషయం కూడా అతడు గ్రహించాడు. గతమంతా స్పష్టంగా గుర్తురావడంతో, తనే ఆ బంగారు విగ్రహాన్ని సృష్టించిన విషయం వినోదుడికి తెలియవచ్చింది!

"మనం ఇంకా ఇక్కడ వుండడం క్షేమం కాదు. రాజులాగా నటిస్తున్న దుష్ట మాంత్రికుడు చేస్తున్న దుండగాలు నీకు తెలియవు. రాజు దురాశాపరుడయినప్పటికీ, నన్ను పెళ్ళాడాలన్న పేరాశ కొద్దీ నాకు ప్రాణం తెప్పించడానికి పడరాని పాట్లు పడుతున్నాడు. అయితే, దుర్మార్గుడైన ఈ మాంత్రికుడు బంగారం కోసం విగ్రహాన్ని పెకలించి, కరిగించడానికి పథకం వేశాడు. అతని భటులు కొంతసేపట్లో ఇక్కడికి రాగలరు," అన్నది యువరాణి.

వినోదుడూ, యువరాణీ కొంతసేపటికి ఎత్తైన కొండశిఖరాన్ని చేరుకున్నారు. అప్పుడప్పుడే చీకటిని దూరం చేస్తూ సూర్యుడుదయిస్తున్నాడు.

"ఎంత అందంగా ఉన్నదీ భూప్రపంచం!" అన్నది యువరాణి.

"నిజంగానా!" అంటూ వినోదుడు ఇంకా ఏదో చెప్పబోయేంతలో కొండ దిగువన ఏదో కలకలం వినిపించింది. ఇద్దరూ అటుకేసి చూశారు.

రాజభటులు, "విగ్రహం ఎక్కడ? పీఠం మీది బంగారు విగ్రహం ఏమయింది?" అని ఒకరినొకరు అడుగుతూ,

ఆకలిగొన్న తోడేళ్ళలా అటూ ఇటూ తిరగసాగారు.

కొంతసేపటికి రాజు వేషంలో వున్న మాంత్రికుడు పెద్ద పెద్ద అంగలు వేసు కుంటూ అక్కడికి వచ్చాడు. చెప్పరాని వేదనతో, పట్టరాని కోపంతో, "భటు లందరినీ హతమారుస్తాను," అన్నాడు కీచుకంఠంతో.

భటులకేసి చూస్తూ మరికొంతసేపు కాలుకాలిన పిల్లిలా చిందులు తొక్కాడు. ఆ తరవాత అతడి దృష్టి అసలురాజు వున్న గుహ కేసి మళ్ళింది. తాను మోసంతో రాజును బంధించిన విషయం ఇంతవరకూ ఎవరికీ తెలియదన్న సంగతి కూడా మరిచిపోయి, "వాడే, రాజే ఆ విగ్రహాన్ని దొంగిలించి వుంటాడు!" అని అరిచాడు.

వాడి మాటలు విని, అక్కడికి వచ్చిన మంత్రీ, మహాజ్ఞానులూ దిగ్భ్రాంతి చెందారు. వాడు భటులను వెంటబెట్టుకుని గుహలోపలికి వెళ్ళి, అందులో వున్న గోడను పగలగొట్టమని ఆజ్ఞాపించాడు.

భటులు నిమిషాలలో గోడను పగల గొట్టి అవతలవున్న రాజును బయటకు తీసుకువచ్చారు.

రాజు చిక్కిశల్యమై, చింపిరి గడ్డంతో దయ్యంలాగా ఉన్నాడు. ఆయన ఒక్క గెంతున ముందుకు దూకి, ఎవరూ ఊహించని విధంగా, రాజు వేషంలో వున్న మాంత్రికుడి నడుముకు వేలాడు





అయనే తమ రాజని, రాజోద్యోగులు గుర్తించారు!

తమ ఎదుట రక్తంలో పడివున్న మాంత్రికుడి శవాన్ని ప్రతి ఒక్కరూ కాలితో తన్నసాగారు. అలా తన్నేందుకు వీలుగా, వాళ్ళను వరుసక్రమంలో పంప డానికి ముఖ్యమంత్రి నానాయాతనలు పడసాగాడు.

"నిష్ప్రయోజనమైన ఆ దుర్మార్గుడి శవాన్ని తన్నడంకన్నా, బంగారాన్ని తన్నుండిరా మూర్ఖుల్లారా!" అని అరిచాడు రాజు.

అందరూ రాజుకేసి ఆశ్చర్యంగా చూశారు.

"బంగారువిగ్రహం పీఠానికి అడుగున వున్న బండకింద, బంగారుద్రవం నిండిన పెద్ద తటాకం వున్నది. గుహలో బందీగా వున్నప్పుడు సారంగంకుండా నేనా తటాకాన్ని చూశాను. రండి. దానిని త్రవ్వండి. అయితే ఒక్కటిమాత్రం బాగా గుర్తుంచుకోండి. ఆ తటాకంలోని బంగారమంతా నాదే. కావాలంటే కొన్నాళ్ళు గడిచాక మీకంతా ఒక్కొక్క గరిటెడు ఇవ్వగలను. నోళ్ళు వెళ్ళబెట్టి నా లోయలోని గాలి నంతా పీల్చేస్తూ అలా చూస్తూ నిలబడ్డా రెందుకు? మూర్ఖుల్లారా కదలండి. ఈ క్షణమే మీరు తవ్వడం ప్రారంభించండి.

తున్న ఒరలోని కత్తిని లాక్కొని, వికటాట్ట హాసం చేస్తూ మాంత్రికుడి తలను తెగ వేశాడు!

రాజు వేషంలో వున్న మాంత్రికుడి అంగరక్షకులు రాజుకేసి రాసాగారు. అయితే, అసలురాజు కంఠస్వరం గుర్తు పట్టి అలాగే నిలబడిపోయారు.

రాజు మంత్రినీ, మహాజ్ఞానులనూ పేరు పేరునా పిలిచి, "వెళ్ళండి, మీమీ ఇళ్ళకు వెళ్ళి, వెంటనే నాకు రుచికర మైన అహారం తీసుకురండి," అని ఆజ్ఞాపించాడు.

కంఠస్వరాన్నీ, మనస్తత్వాన్నీ బట్టి ఆకలిగొన్న గుడ్లగూబలా ఉన్నప్పటికీ,



నాకు లడ్డూలు తెచ్చిపెట్టండి!'' అని అరిచాడు రాజు.

ఇంతకుముందు విగ్రహాన్ని పెకలించడానికి వచ్చిన రాజభటులు, అమితోత్సాహంతో ఇప్పుడు పలుగులతో పీఠం కింది బండను పగలగొట్టడం ప్రారంభించారు.

హఠాత్తుగా పిడుగుపడ్డట్టు భయంకరమైన శబ్దం వినిపించింది. వాళ్ళు పగలగొట్టడానికి పూనుకున్న బండ చుక్కలా ఆకాశంలోకి దూసుకుపోయి మేఘాల మధ్య వేనవేల ముక్కలయింది. ఆ బండ వున్నచోటు నుంచి, చెప్పరాని వేగంతో బంగారుద్రవం బుగ్గ పైకి చిమ్ముకొచ్చింది. దానిని చూడగానే అక్కడి వారు భయాశ్చర్యాలతో కేకలు వేయసాగారు. కొంతసేపటికల్లా బంగారుద్రవం ఆ ప్రాంతాన్ని చుట్టు ముట్టసాగింది. సలసల కాగుతూండడంవల్ల, ఆ ద్రవం తాకగానే దాని వేడికి తట్టుకోలేక భటులు విలవిల తన్నుకుంటూ అక్కడే పడి ప్రాణాలు కోల్పోసాగారు.

రాజూ, మంత్రీ, మహాజ్ఞానులూ హడలిపోయి అక్కడి నుంచి తప్పించుకోవడానికి ఎంతో ప్రయత్నించారు. కాని, క్షణక్షణానికి బంగారుబుగ్గ వేగం హెచ్చి, ప్రవాహం ఉధృతం కాసాగింది. ఒకటి రెండు నిముషాలలో వాళ్ళందరూ సలసల కాగుతున్న ఆ ద్రవంలో మునిగిపోయారు.

భయంకరమైన ఆ ద్రవప్రవాహం మైదానాలకేసి రావడం చూసి, కొండ దిగువన ఉన్న ప్రజలు భయభ్రాంతులయ్యారు. ప్రాణాలను గుప్పెట్లో పెట్టుకుని హృదయ విదారకంగా కేకలు వేస్తూ దిక్కుదిక్కుకూ పరిగెత్తసాగారు. అయినా ఆ బంగారుద్రవప్రవాహం తాకిడి నుంచి ఒక్కరు కూడా తప్పించుకోలేకపోయారు.

మిట్టమధ్యాన్నంవరకు అలా ప్రళయభీకరంగా పెల్లుబికిన బంగారుద్రవప్రవాహం నెమ్మదిగా ఆగిపోయింది. ఎక్కడ చూసినా భయానకమైన నిశ్శబ్దం

అలముకున్నది. పక్షులు సైతం అరవ డానికి సాహసించలేకపోయాయి!

''బంగారులోయ రాజ్యం ఇప్పుడు నిర్మానుష్యప్రదేశం!'' అన్నది యువరాణి విచారంగా.

''భూప్రపంచం ఎంతో అందమైన ప్రదేశం అని నువు ఇంతకుముందే అన్నావు. అయినా, మానవుడు ఎంతటి దురదృష్టవంతుడు! తన చేజేతులా మానవుడే భూమిని నివాసయోగ్యం కాకుండా చేసుకుంటున్నాడు,'' అన్నాడు వినోదుడు పెద్దగా నిట్టూరుస్తూ.

కొంతసేపు మౌనంగా ఊరుకుని, యువరాణి, ''మన ప్రస్తుత కర్తవ్యం ఏమిటి? మనం ఎక్కడికి వెళ్ళడం? ఏం చెయ్యడం?'' అని అడిగింది.

"ఇక్కడే వుండి ప్రార్థనలు జరుపుదాం. మన ప్రార్థనలు ఫలించి మళ్ళీ ప్రజలు తప్పక తిరిగివస్తారు. వాళ్ళు నూతన జీవితం ప్రారంభించడానికి మనం సహాయపడదాం,'' అన్నాడు వినోదుడు.

''అదిగో చూడు! బంగారు ద్రవం బండరాయిగా మారిపోతున్నది!'' అన్నది యువరాణి.

''మారిపోనీ. అది మళ్ళీ బంగారమవుతుంది. మనుషుల మనసులు బంగారంలా మారినప్పుడు ఆ బండరాయి మళ్ళీ బంగారమవుతుంది. అదిగోచూడు ఆ చిన్న కొలను. అందులో బురదతప్ప మరేదీలేదు. అయినా సూర్యకాంతి సహాయంతో అందులో నుంచి అందమైన తామరపుష్పాలు వికసిస్తున్నాయి. ప్రకృతిలోనే అటువంటి అద్భుతం సాధ్యమైనప్పుడు, దేవుడి దయవల్ల మనిషిలో కూడా ఏమాత్రం చెడు చేయనటువంటి మహత్తరమైన మార్పురాదా?'' అన్నాడు వినోదుడు.

''తప్పకుండా వస్తుంది!'' అన్నది యువరాణి.

ఇరువురూ ఒకరినొకరు చూసి చిన్నగా నవ్వారు. ఆ నవ్వులో విశ్వాస రేఖలు ప్రకాశించాయి! —(అయిపోయింది)



# చట్టం-న్యాయం

ఒకానొక రాజ్యంలోని ప్రజలు, వస్త్రధారణ విషయంలో మితిమీరిన స్వేచ్ఛతో ప్రవర్తించ సాగారు. ప్రజలందరూ నిండుగా బట్టలు కట్టితీరాలని రాజు చట్టం చేసి, దాన్ని కఠినంగా అమలు చేయసాగాడు.

ఒకనాడు భటులు, ముగ్గురిని బంధించి తీసుకువచ్చి రాజు ముందు నిలిపారు. వారిలో ఒకడు అనాగరికుడు; గోచితో వున్నాడు. రెండవవాడు సామాన్యవ్యక్తి; అర్ధనగ్నంగా వున్నాడు. మూడవవాడు ఒక యోగి; దినమొలతో వున్నాడు.

రాజు పక్కనే వున్న మంత్రి, అనాగరికుణ్ణి నిర్బంధ వయోజన విద్యాలయంలో చేర్చమన్నాడు. సామాన్యవ్యక్తికి పది కొరడాదెబ్బలు శిక్షగా వేశాడు. యోగిని దుశ్శాలువతో కప్పి పంపేశాడు.

ఇది చూసి రాజు ఆశ్చర్యపోయి, "ఇదేమిటి ?" అని మంత్రిని ప్రశ్నించాడు.

అందుకు మంత్రి, "మహారాజా, ముగ్గురూ చట్టాన్ని ఉల్లంఘించిన మాట నిజమే! కాని, మొదటివాడిది ఆటవికస్థాయి. మనం వాడికి కొంత సంస్కారం కలిగించవలసి వున్నది. రెండవ వాడిది సాధారణస్థాయి. దండించి వాడిని సరైన మార్గాన పెట్టవలసి వచ్చింది. యోగి చట్టాన్ని అతిక్రమించాడు. కాని, ఆయనది చట్టానికి అతీతమైన సంస్కారం. చట్టం సంకెళ్ళలో ఆయనను మనం బంధించలేం!" అన్నాడు.

చట్టానికి, న్యాయానికి మధ్య వుండే అంతరువు, అప్పటికిగాని రాజుకు అర్థం కాలేదు.

—డా॥ తాటిచెర్ల గురురామప్రసాద్






# పాము-మనిషి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా ఈ చరాచర ప్రపంచం పరస్పర విరుద్ధమైన బుద్ధీ, నైజాలు గల ప్రాణులకు నిలయం. వాటి జీవనపోరాటం వైషమ్యాలతో, నయవంచనలతో సాగిపోతూ వుంటుంది. ఈ సత్యాన్ని గ్రహించినవాడి వైతేసరి. అలా కానప్పుడు నీ పట్టుదలా, శ్రమా అంతా బూడిదలోపోసిన పన్నీరు కాగలదు. ఇందుకు ఉదాహరణగా సిద్ధేంద్రుడనే సాధువు కథ చెబుతాను. శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

వింధ్యపర్వత సానువుల్లో వున్న గుహల్లో, సిద్ధేంద్రు డనే సాధువు తపస్సు

## బేతాళ కథలు



పామును చూసి వింతపడి, సాధువు దగ్గిరలో వున్న కొలనులోంచి తామర తూడుల్ని తెచ్చి ముడివేసి, వాటి సాయంతో పామును పైకి చేర్చాడు.

సాత్వికి అనబడే ఆ సర్పం, తనకు వచ్చిన కష్టం గురించి సాధువుతో, "మహానుభావా! పాతాళబిలాల్లో నివసించే నాబోటి నాగసర్పాలకు, అప్పుడప్పుడూ పైకి వచ్చి విహరించడం పరిపాటి. అమధ్య ఒకసారి నేను, రాత్రివేళ పుచ్చపువ్వులా కాస్తున్న వెన్నెల వెలుగులో, నా పిల్లలను వెంటబెట్టుకుని, యీ దాపుల గల మొగలి పొదల్లో తిరుగుతున్నాను. హఠాత్తుగా ఒక మనిషి వేగంగా వస్తూ, నా తోకతొక్కాడు. వెంటనే నేను బుసకొట్టి, వాణ్ణి కాటు వేయబోయాను. అయితే ఆ మనిషి రెండు చేతులూ జోడించి, నా ముందు మోకరిల్లాడు.

చేస్తూండేవాడు. కొంతకాలానికి, ఆయనకు తాను దివ్యజ్ఞాన ప్రబోధితుడయ్యానన్న నమ్మకం కలిగింది. ఆ జ్ఞానసిద్ధిని లోకానికి పంచిపెట్టే సంకల్పంతో, ఆయన మనుషుల మధ్యకు బయల్దేరాడు.

మార్గమధ్యంలో ఆయనకు, ఒకచోట పాడుపడ్డ బావిలోంచి, ఎవరో దీనంగా ఏడుస్తున్న ధ్వని వినవచ్చింది. సిద్ధేంద్రుడు బావి దగ్గిరకు పోయి లోపలికి తొంగి చూశాడు. ధగధగ మెరిసిపోతున్న, నాగసర్పం ఒకటి ఆయనకు కనిపించింది.

అది ఆయనను చూస్తూనే, పడగ ఎత్తి వినయంగా తనను కాపాడమని వేడుకున్నది. మనిషిస్వరంలో మాట్లాడే, ఆ

నేను అతణ్ణి దయతలచి వెళ్లబోతున్నంతలో వాడు, నా దారికి అడ్డువచ్చి, తన ఆతిథ్యం స్వీకరించాలంటూ పోయి, కొద్ది సేపట్లో ఒక కుండెడుపాలతో వచ్చాడు. నేను, నా పిల్లలతోపాటు, ఆ పాలు తాగాను. ఆ మరుక్షణం నన్ను మత్తులాంటిదేదో ఆవహించి, ఒళ్ళు తెలియని స్థితిలో పడిపోయాను. తర్వాత స్పృహ వచ్చాక చూస్తే, యీ బావిలో వున్నాను.

నా పిల్లలను, ఆ దుర్మార్గుడు పట్టుకు పోయి వుంటాడు!'' అని చెప్పుకున్నది.

సర్పం చెప్పింది విని, సాధువు తన దివ్యదృష్టితో, ఆ మోసగాడెవడై వుంటాడా అని చూశాడు. పొలిమేర గ్రామాన వున్న మహేంద్రుడనే పాములు పట్టేవాడు, ఈ దుష్టకార్యానికి పూనుకున్నట్టు, ఆయనకు తెలిసింది.



ఆయన పాముతో, ''దిగులుపడకు! నీకు న్యాయం కలిగేలా చేస్తాను. నీ బిలానికి వెళ్ళు.'' అని చెప్పి, మహేంద్రుడి ఇంటికి వెళ్ళి, తాను పామునుంచి విన్నది వాడికి చెప్పి, ''ఇంత నమ్మకద్రోహం ఎందుకు చేశావు?'' అని అడిగాడు.

అందుకు మహేంద్రుడు వినయంగా, ''స్వామీ, నేను చేసింది తప్పే కాదనను గానీ—పాములు పట్టడం, నా వృత్తి. అయినా, నన్ను కాటు వేయకుండా వదిలిన పెద్ద పామును విడిచిపెట్టాను. దాని పిల్లలు క్షేమంగా, నా దగ్గిరే వున్నవి. వాటి విషం పిండి అమ్ముకుని పొట్టపోసుకుందామనుకున్నాను. అయితే, మీ మీది భక్తికొద్దీ, వాటిని స్వేచ్ఛగా వదిలేస్తాను. ఆ పని నా చేతిమీదగానే జరగనివ్వండి!'' అని కోరాడు.

సాధువు, మహేంద్రుడి మాటలకు తృప్తిపడి, వాణ్ణి సాత్వికివుండే బిలం దగ్గిరకు తీసుకుపోయాడు. సాత్విక, మహేంద్రుడిలో వచ్చిన మార్పుకు చాలా సంతోషించి, వాడికి తన తలమీద వున్న మణిని యిచ్చింది. తర్వాత సాధువు సాయానికి తన కృతజ్ఞతలు చెప్పుకున్నది.

సాధువు అక్కడినుంచి బయలుదేరి, ఊరూరా తిరుగుతూ, ప్రజలకు హితోపదేశం చేస్తూ, కొన్నాళ్ళకు లోగడ వచ్చిన దారినే వస్తూ, సాత్వికిని చూడబోయాడు. ఈసారి అది మరింత చింతాక్రాంతురాలై చిక్కిపోయి వున్నది.

సాధువు, దాని చింతకు కారణం అడిగాడు. పాము ఆయనతో జరిగినదంతా చెప్పింది:



మణి పుచ్చుకుపోయిన మహేంద్రుడు, ఆ మర్నాడే దానిదగ్గిరకు వచ్చి తాను ఇక పైన పాములను పట్టననీ, సిద్ధేంద్రుడిలాగా సాధు మార్గంలో నడవదలచినట్టూ చెప్పాడు. సాత్వికి, మహేంద్రుడి వస్త్ర ధారణలో వచ్చిన మార్పు కూడా చూసి, వాడి మాటలు నమ్మింది. ఆనాటి నుంచి వాడు తరచుగా సాత్వికీ, ఇతర పాములూ వుండే బిలం దగ్గిరకు రాసాగాడు.

ఒకనాడు వాడు బిలంలో వున్న పాములను, వెన్నెల విహారానికి బయలుదేర దీశాడు. అవి మొగలిపొదల్లో విహరిస్తూండగా, వాడు వాటి చుట్టూ మంటలు రగిల్చి అవి కాలి బూడిద అయేలా చేశాడు.

తర్వాత వాడు, ఆ బూడిదలో వెతికి దొరికిన మణులను అమ్మి లక్షాధికారి అయిపోయాడు. ఆ మంటలనుంచి తప్పించుకున్న సాత్వికి, తన బిలం చేరినా—స్వజాతి నాశనానికి తానే కారకురాలినయ్యానన్న దిగులుతో కృశించి పోతున్నది!

ఇది విన్న సిద్ధేంద్రుడు రౌద్రమూర్తి అయి, హుటాహుటిని మహేంద్రుడింటికి పోయాడు. ఆ సమయంలో వాడు, ఇంటి ముందు కట్టించిన గుడిలో నిలువెత్తు నాగ విగ్రహం ముందు పూజచేస్తున్నాడు.

సాధువు, వాణ్ణి సమీపించి, "దుర్మార్గుడా! నమ్మించి, అన్ని పాములను నాశనం చేసింది చాలక, పూజలు కూడా చేస్తున్నావా?" అని కోపంగా ప్రశ్నించాడు.

అందుకు మహేంద్రుడు, ఎంతో వినయంగా, "స్వామీ, యిందులో నా తప్పేముంది? ఉపకారికి ప్రత్యుపకారం తొలిసారి చేశాను. అలా అని, అపకారికి ఉపకారం చేస్తానని, తమకు మాటివ్వలేదు గదా! మనుషులు, పాములను కొలిచినా, అవంటే భయపడతారు; కారణం అవి విష జంతువులు కనక. అలాగే పాములు, మనుషులు తమను కొలిచినా—వాళ్ళను నమ్మవు. ఎందువల్లనంటే, వాళ్ళు తమకంటే తెలివైనవాళ్ళని వాటికి

తెలుసు. అలాంటిది, పాము, మనిషిని నమ్మడం ఎవరి పొరబాటంటారు?'' అని అడిగాడు.

ఆ మాటలకు, సిద్ధేంద్రుడు ఎక్కడ లేని ఆగ్రహంతో, ''దయాగుణాన్ని మరిచి, అమాయక ప్రాణుల్ని చంపిన నువ్వు, పామువై పడివుండు!'' అని శపించాడు.

ఆ శాపం మహేంద్రుణ్ణి ఏమీ చేయలేక పోయింది. సాధువు విస్తుపోయి, తల వంచుకుని అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, అంత తపస్సంపన్నుడైన సిద్ధేంద్ర యోగి శాపం ఫలించకపోవడానికి కారణం ఏమిటి? న్యాయం, ధర్మం మహేంద్రుడి పక్షాన వుండడం కారణమా? ఈసందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''సాధువు శాపం విఫలంకావడానికి, చాలా ముఖ్యమైన కారణమే వున్నది. ప్రకృతిధర్మం లాంటిదే, ప్రాణుల నైజం కూడా. వాటిని ఏ శక్తీ శాసించి మార్చజాలదు. అంత తపోనిధి అయిన సాధువు, ఈ ధర్మ సూక్ష్మాన్ని గుర్తించలేక పోయాడు. పామూ—మనిషి మధ్య సహజీవనం సాధ్యపడదు. ఆ సంగతి తనకు చేతనైన రీతిలో మహేంద్రుడు, సాధువుకు చెప్పాడు. అయినా, సాధువు తన దురాగ్రహం కొద్దీ, దాన్ని అర్థం చేసుకోలేక పోయాడు. తేలుకు తోకలోనూ, పాముకు తలలోనూ, ఖలుడికి నిలువెల్లా విషం అని, లోకవృత్తం తెలిసిన విజ్ఞులు ఏనాడో చెప్పారు. ఇది మహేంద్రుడి పట్ల నూటికి నూరు పాళ్ళు వాస్తవం. అలాంటి వాణ్ణి సాత్వికీ, యితర పాములూ వుండే బిలం దగ్గిరకు తీసుకుపోయి, వాటి నాశనానికి కారకుడయ్యాడు సిద్ధేంద్రుడు. ఈ అన్ని కారణాలవల్లా, అతడి శాపం వమ్మయి పోయింది,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# స్వయంసేవకుడు

ఒక ఊళ్ళో జగన్నాథం అనే గృహస్థు ఉండేవాడు. ఆయన కుమార్తెను పొరుగూళ్ళో, కాస్త హోదా గల చోట ఇచ్చి పెళ్ళి చేశాడు.

జగన్నాథంగారి కుమార్తె తొలి కానుపుకు పుట్టింటికి వచ్చి, పండంటి మగబిడ్డను కన్నది. కొద్ది మాసాలు గడిచాక జగన్నాథంగారి అల్లుడు ఫలానా రోజున వచ్చి తన భార్యనూ, బిడ్డనూ తీసుకు పోతానని మామగారికి ఒక మనిషి ద్వారా కబురు చేశాడు.

జగన్నాథంగారు గొప్ప స్థితిపరుడేమీ కాదు. ఉన్నంతలో ఏ లోటూ లేకుండా జీవిస్తున్నా, ఆయన ఇంటి కొక నౌకరును పెట్టుకోలేకపోయినాడు. అదీగాక ఆయన కాస్త లోభ స్వభావంగలవాడు కూడానూ. అల్లుడు స్థితిమంతుడు గనక అతను ఉండే ఒక్క రోజుకైనా ఒక నౌకరుంటే బాగుంటుం దనిపించింది జగన్నాథంగారికి.

అల్లుడు వచ్చే రోజు ఉదయం నుంచీ ఆర్భాటంగా పిండివంటలూ అవీ చెయ్యనారంభించాడు.

జగన్నాథంగారు నౌకరు కోసం పొద్దుటి నుంచి తెగతిరిగి ఇంటికి వచ్చి, భార్యతో తన ప్రయత్నం వృథా అయిందనీ, అల్లుడు పిలిస్తే పలకటానికి నౌకరు లేక పోతే ఎంత మాత్రమూ మర్యాదగా ఉండదనీ అన్నాడు.

భార్యాభర్తలు ఈ విషయాలు మాట్లాడుకునే సమయంలో ఒక బిచ్చగాడు పిండివంటల వాసన చేత ఆకర్షించబడి వాకిట నిలబడి, వాళ్ళనుకునే మాటలన్నీ విన్నాడు. మంచి భోజనంతో బాటు పిండివంటలు కూడా ఆరగించాలని వాడికి బుద్ధిపుట్టింది.

ముందు వసారాలో ఎవరూ లేకుండా చూసి వాడు చప్పున బావి వైపుకు వెళ్ళి, అక్కడ ఉన్న ఒక పాతబట్టా, కొద్దిగా చినిగిన చొక్కా తీసుకుని, తన కుళ్ళు బట్టలు విప్పి ఒక మూలగా పెట్టి, గుట్టు చప్పుడు కాకుండా ఈ బట్టలు వేసుకుని, తల కొక తువాలు చుట్టుకుని ఇంటి ముందుకు వెళ్ళి, చేతులు కట్టుకుని గోడవార నిలబడ్డాడు.

ఈ సమయానికే ఇంటి ముందు జట్కా బండీ ఒకటి వచ్చి ఆగింది. అందులో నుంచి జగన్నాథంగారి అల్లుడు దిగాడు.

బిచ్చగాడు చప్పున వెళ్ళి, బండిలో నుంచి పెట్టె దించి చేత బట్టుకుని, అల్లుడి వెనకాలే లోపలికి వచ్చాడు.

బండి ఆగిన చప్పుడు విని, బయటికి వచ్చిన జగన్నాథం అల్లుణ్ణి పలకరించి, వెనకగా వచ్చినవాడు అల్లుడి వెంట వచ్చిన నౌకరే ననుకుని మనస్సులో చాలా ఆనందించాడు.

అల్లుడు మటుకు వాణ్ణి చూసి అత్తవారి నౌకరయి ఉంటాడనుకున్నాడు.

అల్లుడిగారి నౌకరన్న ఉద్దేశంతో జగన్నాథమూ, ఆయన భార్యా కూడా బిచ్చగాణ్ణి కాస్త మర్యాదగా చూశారు. ఏవైనా చిన్న చిన్న పనులు చెప్పవలసి వస్తే ఎంతో మంచిగా చెప్పి చేయించు కున్నారు.

లోపల అందరూ భోజనాలకు కూర్చున్న సమయంలోనే జగన్నాథం బిచ్చగాడికి



వసారాలో భోజనం పెట్టించి, శ్రద్ధగా కనుక్కునివడ్డనచేయించాడు. బిచ్చగాడా పూట విందు భోజనం కడుపారా తిని తృప్తిచెందాడు.

భోజనా లయాక జగన్నాథం అల్లుడికి కొత్త బట్టలు పెట్టాడు. జగన్నాథం భార్య ఇన్ని పిండివంటలు మూటగట్టి బిచ్చగాడి కిచ్చి, "నీ పెళ్ళానికీ పిల్లలకూ పెట్టు, నాయనా!" అన్నది.

పొద్దు వాలే దాకా విశ్రాంతి తీసుకుని, జగన్నాథం అల్లుడు తన భార్యతోనూ, బిడ్డతోనూ ప్రయాణమయాడు. బిచ్చగాడే వెళ్ళి ఒక జట్కాబండి మాట్లాడి తెచ్చి, సామానులన్నీ, బండిలో పెట్టాడు. జగన్నాథం అల్లుడు అందరికన్నా ఆఖరుకు బండిలో ఎక్కుతూ, తన అత్తవారి ఇంటి నౌకరు గదా అనుకుని బిచ్చగాడి చేతిలో ఒక రూపాయి పెట్టి, "ఉంచుకో!" అన్నాడు.

బండి కదిలాక, జగన్నాథం కూతురు తన భర్తతో, "వాడికి డబ్బు లిచ్చి పంపేస్తున్నారు, మీ వెంట వచ్చిన మనిషి కాడా?" అని అడిగింది.

"కాడే! మీవాళ్ళ నౌక రనుకున్నాను," అన్నాడు అల్లుడు.

"మీ వెంటవచ్చిన నౌకరని మావాళ్ళు అనుకున్నారు," అన్నది భార్య. ఇద్దరూ నవ్వుకున్నారు.

"ఏమండీ, ఆ నౌకరు అల్లుడిగారి బండి వెంట వెళ్ళక ఇంకెటో వెళ్ళిపోతున్నాడు. వాడు అల్లుడిగారి నౌకరు కాడు!" అన్నది జగన్నాథంతో ఆయన భార్య ఆశ్చర్యంగా.

"అయితే ఎవడు వీడూ?" అన్నాడు జగన్నాథం. వాడు తాను పెట్టిన నౌకరూ కాదు, అల్లుడి వెంట వచ్చిన నౌకరూ కాదు. ఎవడో దారే వెళ్ళే దానయ్య! అలాటి వాణ్ణి అల్లుడి నౌకరు అనుకుని మర్యాద చేసినందుకు మండిపడిపోతూ జగన్నాథమూ, భార్యా వాణ్ణి నానాతిట్లూ తిట్టుకుంటూ తలవాకిలి తలుపు మూసి లోపలికి వెళ్ళిపోయారు.



# చందమామ అనుబంధం—1
# మన విజ్ఞాన సంపద

మహనీయులు:

## గురునానక్



1469వ సంవత్సరం నవంబర్‌లో (కార్తీకపౌర్ణమినాడు) నానక్, పంజాబులో ప్రస్తుతం ఆయన పేరుమీదుగా నాన్‌కానాగా ప్రసిద్ధి గాంచిన చోట జన్మించాడు. పువ్వు పుట్టగానే పరిమళించే విధంగా, నానక్ బాల్యం నుంచే మంచి తెలివితేటలను ప్రదర్శించాడు. దేవుణ్ణి గురించీ, జీవిత సత్యాలను గురించీ గురువులను ప్రశ్నించేవాడు. దేవుడిమీద ప్రార్థనాగీతాలు రచించేవాడు. నానక్ తండ్రి అతనికి పెళ్ళిచేసి, సుల్తానాపూర్‌లో ఉద్యోగంలో ప్రవేశపెట్టాడు. నానక్ తన సంపాదనలో ఎక్కువ భాగాన్ని పేదసాదలకు పంచి పెట్టేవాడు. అయినా అతడు ఆట్టేకాలం సంసార జీవితం గడపలేదు. కుటుంబ భారాన్ని దేవుడిపై మోపి, తీర్థ యాత్రలకు బయలుదేరాడు. ఆయన పుణ్యతీర్థాలను సేవిస్తూ—దైవభక్తినీ, సర్వమానవ సమానత్వాన్నీ ప్రచారంచేశాడు. హిందూమతమైనా, ఇస్లాంమతమైనా, సత్యం ఏ ఒక్క మతానికి మాత్రమే సొంతం కాదనీ, పరమత సహనం, దేవుడి పట్ల అచంచలభక్తి ప్రధానం అని ఆయన ప్రబోధించాడు. ఆయన అంతిమ దశను బీస్ నదీతీరం కర్తార్‌పూర్‌లో గడిపాడు.

నానక్ ప్రచారం చేసిన జీవనమార్గం సిక్కుమతంగా ప్రసిద్ధిగాంచింది. ఆయన డెబ్బైయవ యేట పరమపదించాడు. అప్పుడు ఆయన భౌతికకాయం తమకు చెందాలంటే తమకే చెందాలని హిందువులూ, ముస్లిమ్‌లూ పోటీపడి, తీరా కాయానికి కప్పిన బట్టను తొలగించి చూస్తే అక్కడ పువ్వులు కనిపించాయనీ చెబుతారు. భక్తులు వాటిని పంచుకున్నారు.

## ఎవరాయన?

నదీతీరంలో ఉన్న కాళికాలయంలోకి, ఒకనాటి అర్ధరాత్రి సమయంలో యువకు డొకడు ఒంటరిగా ప్రవేశించాడు. అతడు కన్నీరు మున్నీరుగా రోదిస్తూ, "ఈ అవమాన భారంతో నేనిక జీవించలేను. నీ సమక్షంలో ఇప్పుడే ప్రాణాలు విడుస్తాను," అన్నాడు.

"అలాంటి పాపకృత్యానికి పాల్పడకు! ఆత్మహత్య నీ ఆత్మకు మరింత క్షోభ కలిగిస్తుంది," అని హెచ్చరించింది దివ్యస్వరం.

"అయితే నన్ను పండితుణ్ణి చెయ్, తల్లీ!" అని ప్రార్థించాడు యువకుడు.

"పండితుడు కాదగిన పరిపక్వత నీలో లేదు; నువ్వు పండితుడు కావాలంటే ఏడు జన్మలెత్తాలి నాయనా!" అన్నది దివ్య స్వరం.

"అయితే ఈ క్షణమే ప్రాణాలు విడుస్తాను," అంటూ కత్తితో తనను పొడుచుకో బోయాడు యువకుడు.

"ఆగు!" అంటూ దేవత అడ్డుపడి, అతణ్ణి ఏడుసార్లు మరణించే విధంగా చేసి మళ్ళీమళ్ళీ సజీవుణ్ణిగా చేసింది. ఆ తరవాత ఆ యువకుడు గొప్ప కవిపండితుడుగా ఆలయంనుంచి వెలుపలికి వచ్చాడు!

ఈ కథలోని యువకుడెవరో మీకు తెలుసా? (VIII పేజీ చూడండి)

# విజ్ఞాన వినోదం

## ఆకర్షణశక్తి



**సూచనలు :**

పింగ్ - పాంగ్ బంతిని టేపు ముక్క సాయంతో ఒక దారానికి అతికించండి. ఆ బంతిని పటంలో చూపిన విధంగా, కొళాయి నుంచి కిందికి ప్రవహించే నీళ్ళకు తగిలే విధంగా పట్టుకుని, చేతిని నిదానంగా నీళ్ళకేసి తీసుకురండి. ఇప్పుడు బంతి నీళ్ళకేసి ఆకర్షించ బడిందా? బంతి నీళ్ళలో కొంత మునిగి వున్నది కదా?

ఏం జరుగుతుంది? ఎలా జరుగుతుంది?

పై ప్రయోగంలో బంతి ప్రవహిస్తూన్న నీటికేసి ఆకర్షింపబడినట్టు కనిపిస్తుంది. ఎందుకంటే—నీళ్ళు ద్రవపదార్థం—అది ప్రవహిస్తున్నది. ప్రవహించే ద్రవం ఏదైనా—ప్రవహించే దిశకు ఎక్కువ ఒత్తిడినీ, పక్కలకు తక్కువ ఒత్తిడినీ కలిగిస్తుంది. ఈ కారణంగా చుట్టుపక్కల ఉన్న గాలికన్నా ప్రవహిస్తూన్న నీళ్ళు, బంతిమీద తక్కువ ఒత్తిడిని పుట్టిస్తుంది. చుట్టుపక్కల గాలి ఒత్తిడి కారణంగా బంతి నీళ్ళకేసి ఆకర్షింపబడినట్టు, కనిపిస్తుంది.

నీళ్ళు వేగంగా పడేప్పుడు బంతిని వెలుపలికి లాగడం కష్టమా? నీళ్ళ వేగం తగ్గితే ఏమవుతుంది? పాసెట్ హాండిల్ పూర్తిగా తెరవబడి, నీళ్ళు ఎక్కువ వేగంతో కిందికి ప్రవహిస్తూన్నప్పుడు బంతిని వెలుపలికి తీయాలంటే ఎంత శక్తి ఉపయోగించాలి?

పింగ్-పాంగ్ బంతి కాకుండా ఇతర బంతులతో ఇలా చేయవచ్చా? ప్రయత్నించి చూడండి.

గాలి నింపబడిన బెలూన్ లేదా కాగితం ముక్క రోడ్డు ఓరగా పడిఉండి పక్కన కారు వేగంగా వెళ్ళినట్టయితే—ఈ రెండూ కూడా కారుకేసి ఆకర్షింపబడతాయి. అలా ఎందుకు జరుగుతుందో ఇప్పుడు అర్థమయింది కదూ!



## ప్రపంచపు అద్భుతాలు

# పిరమిడ్లు

దాదాపు ఐదు వేల సంవత్సరాలకు పూర్వం ఈజిప్టును ఫరావో రాజులు పరిపాలించారు. ఒక ఫరావో చక్రవర్తి మరణించినప్పుడు అతని కాయానికి పరిమళ ద్రవ్యాలు పట్టించి శవపేటికలో భద్రపరిచారు. తరవాత ఆ పేటికను గోరీలో వుంచి దాని మీద బ్రహ్మాండమైన శిలాకట్టడం నిర్మించారు. అడుగుభాగం దీర్ఘ చతురస్రాకారంలోనూ, పార్శ్వాలలో బోర్లించిన త్రిభుజాకారంలోనూ, పైభాగం మొనదేలినట్టూ, ఈ కట్టడం నిర్మించారు. ఆ తరవాత ఇటువంటి కట్టడాలు చాలా ఏర్పడ్డాయి. వీటినే పిరమిడ్లు అంటారు.

కెయిరో నగరానికి సమీప ఎడారిలో వున్న మూడు పిరమిడ్లే అన్నిటికన్నా బ్రహ్మాండమైనవి. వాటిలోకెల్లా చాలా పెద్దదీ, ప్రాచీనమైనదీ — కూఫూ (ఖియోప్స్) రాజు పిరమిడ్. మానవ నిర్మితమైనకట్టడాలలో బ్రహ్మాండమైనదిగా దీనిని పేర్కొంటారు. ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన కట్టడాలుగా చెప్పుకునే రోములోని సెయింట్ పీటర్స్ కెథెడ్రల్, వెస్ట్‌మినిస్టర్ ఆబే మూడు చర్చ్‌లూ ఇమడగలంత విశాల ప్రదేశంలో ఈ ఒక్క పిరమిడ్ విస్తరించి ఉన్నది. 4,700 సంవత్సరాలకు పూర్వం లక్షమంది కార్మికులు 20 సంవత్సరాలు పనిచేసి దీని నిర్మాణం పూర్తి చేసినట్టు చెబుతారు.

"ఈనాడు అన్ని ఖండాలలో లభించే సాంకేతిక సంపదనంతా సమకూర్చుకున్నప్పటికీ ఖియోప్స్ పిరమిడ్ వంటి బ్రహ్మాండమైన కళాఖండాన్ని ఈ 20వ శతాబ్దంలో నిర్మించడం సాధ్యంకాదు," అంటాడు ప్రముఖ రచయిత ఎన్‌రిచ్ డాన్ డానికర్స్.



# మోసస్ అద్భుత కృత్యాలు

దాదాపు మూడువేల సంవత్సరాలకు పూర్వం ఈజిప్టును ఫరావో రాజు పరిపాలించేవాడు. ఫరావో రాజకుమారి ఒకనాడు నైలు నదిలో స్నానం చేస్తూండగా, నదీ ప్రవాహంలో మూడు నెలల పసికందు గల ఒక పేటిక కొట్టుకురావడం చూసి అమితాశ్చర్యం చెందింది. ఆమె ఆ బిడ్డను నదీ ప్రవాహం నుంచి రక్షించింది.

ఆ రోజులలో ఈజిప్టులో హీబ్రూ మతస్థుల సంఖ్య పెరిగిపోవడంతో, పుట్టిన ప్రతి మగబిడ్డనూ నదీప్రవాహంలో వదలాలని ఆజ్ఞాపించాడు రాజు. అందువల్ల, ఈ బిడ్డ కూడా హీబ్రూ సంతతి వారిదే అయి వుంటుందని యువరాణి గ్రహించింది.



యువరాణి ఆ బిడ్డను కాపాడడం, దూరంనుంచి ఆ బిడ్డ అక్క చూసింది. ఆమె యువరాణి దగ్గరకు వచ్చి, "ఆ బిడ్డను చూసుకోవడానికి మనిషి కావాలా?" అని అడిగింది. యువరాణి, బిడ్డను ఆ అమ్మాయి చేతికిచ్చి భద్రంగా పెంచమని ఆజ్ఞాపించింది. ఆ అమ్మాయి బిడ్డను తీసుకెళ్ళి తన తల్లికి అప్పగించింది. ఆ విధంగా కన్నతల్లే ఆ బిడ్డకు సంరక్షకురాలయింది. యువరాణి అండదండలు కారణంగా ఆ బిడ్డ ఏ లోటూ లేకుండా పెరిగి పెద్దవాడయ్యాడు. అతడే మోసస్.

ఆ కాలఘట్టంలో ఈజిప్టులో హీబ్రూలను హీనంగా చూసేవారు. బానిసల్లాగా వాళ్ళచేత ఊడిగం చేయించుకునేవారు. స్వల్ప కారణాలకే దారుణంగా హింసించేవారు; హతమార్చేవారు కూడా!

'ఓల్డ్ టెస్టమెంట్' (పవిత్ర బైబిల్) లోని 'ది ఎక్సోడస్' (ప్రస్థానం) అధ్యాయంలో మోసస్‌ను గురించిన వివరణ ఉన్నది: ఒక పొదమీద జ్వలించే మంటల మధ్య భగవంతుడు మోసస్‌కు దర్శనమిచ్చాడు. కాని పొద మండి పోలేదు. హీబ్రూ ప్రజల నాయకత్వం వహించమని ప్రభువు మోసస్‌ను ఆదేశించాడు. ఇతరులు కూడా అతణ్ణి విశ్వసించే విధంగా అద్భుతాలు చేయడం ఎలాగో ప్రభువు మోసస్‌కు నేర్పాడు.

హీబ్రూ ప్రజలు ఈజిప్టు దేశాన్ని వదిలి వెళ్ళడానికి ఫరావో రాజును ఒప్పించడానికి మోసస్ ప్రయత్నించాడు. కాని ఫరావో అతని మాటలను పెడచెవిని పెట్టాడు. ఆ పిమ్మట మోసస్ అనేక అద్భుతాలు ప్రదర్శించాడు. నదీ జలాలను రక్తంగా మార్చాడు. దేశమంతటా కప్పలూ, మిడ



తలూ, పేలూ, కీటకాలూ వ్యాపించాయి. తుఫాను తాకిడికి పంటలు సర్వ నాశనమయ్యాయి. ఆఖరికి ఈజిప్టువాళ్ళ ప్రథమ మగసంతానం మరణించసాగింది. అంత జరిగాక, హీబ్రూ ప్రజలు దేశంవదిలి వెళ్ళడానికి అనుమతించాడు ఫరావో రాజు!

మోసస్ తన జాతి జనాన్ని ఇజ్రాయెల్ కేసి నడిపించాడు. మార్గంలో ఎదురైన ఎర్ర సముద్రం, మోసస్ అడుగుపెట్టగానే, నీళ్ళు వైదొలగి దారి ఇచ్చింది. హీబ్రూలు అతనివెంట నడిచారు. మనసు మార్చుకున్న ఈజిప్టువాళ్ళు కొందరు వాళ్ళను తిరిగి రమ్మనడానికి వెళ్ళారు. వాళ్ళందరూ నీళ్ళలో మునిగిపోయారు.

హీబ్రూలు తమ గమ్యస్థానం చేరుకున్నారు. కాని, మోసస్ అక్కడ కాలు మోపడానికి ముందే ప్రాణం వదిలాడు!

ఈ సంఘటనలో కొంతవరకు నిజంగానే జరిగినట్టు నమ్ముతారు. ఈ సంఘటన ఒక నూతన దేశం ఆవిర్భవించడానికి నాంది పలికింది!

## గత చరిత్రకేసి చూద్దాం



1. రెండు నదుల పేర్లనుంచి తన పేరును సంతరించుకున్న ప్రాచీన నగరం ఏది?
   (ఎ) ఆ రెండు నదుల పేర్లు ఏమిటి?
   (బి) ఆ రెండు నదులు కలిసే పెద్ద నది ఏది?
   (సి) ఆ నగరం ఎందుకు ప్రసిద్ధిగాంచింది?
2. భారతదేశాన్ని జయించిన ఒకరాజు, తన తల్లి కుటుంబనామంతో పిలువబడడమే ఇష్టపడ్డాడు. ఆయన ఎవరు?
   (ఎ) అతడు భారతదేశానికి ఎప్పుడు వచ్చాడు?
   (బి) అతడు స్థాపించిన వంశం ఏది?
   (సి) ప్రఖ్యాతిగాంచిన అతని ముత్తాత ఎవరు?
3. అక్బర్ పరిపాలనా కాలంనాటి ప్రభుత్వ దస్తావేజుల పేరేమిటి?
   (ఎ) వాటిని రాసినవారెవ్వరు?
   (బి) అతడు రచించిన మరొక గ్రంథం ఏమిటి?
   అది మొదటిదానికన్నా ఏ విధంగా భిన్నమైనది?
4. ప్రాచీనకాలంలో దక్షిణభారతదేశాన్ని పరిపాలించిన మూడు గొప్ప వంశాలు ఏవి?

(VIII పేజీ చూడండి)

## పరిశోధనలు, అన్వేషణలు ఇతర విశేషాలు

1. నియోన్ లైటును ఎవరు, ఎప్పుడు కనుగొన్నారు?
2. విద్యుత్ కొలమానంలో ఒక పిడుగు శక్తి ఎంత?
3. ఈ ప్రపంచం వయసు ఎంత?
4. టెలిస్కోపును ఎవరు ఎప్పుడు రూపొందించారు?
5. సూర్యుడికీ, భూమికీ మధ్య వున్న దూరం ఎప్పుడూ ఒకేవిధంగా వుంటుందా?
6. గుర్తు తెలియని ఎగిరె పళ్లాలు (UFO) ప్రత్యేకంగా ఏ ఒక్క కాలంలోనే కనిపిస్తాయా?
7. అత్యధిక సంఖ్యలో వార్తా పత్రికలు వెలువడే దేశం ఏది?
8. మనిషి చేతిలో ఒక చదరపు అంగుళం మేరకు వ్యాపించి వున్న నరాలుఎన్నో మీకు తెలుసా?
9. నీళ్ళు తాగకుండా ఒంటెకన్నా ఎక్కువకాలం జీవించే జంతువు ఏది?
10. ఒక జంతువు మైలుదూరం అవతల వున్నా దాని వాసన తెలియవస్తుంది.ఆ జంతువు ఏది?

(VIII పేజీ చూడండి)




1. అత్యధికంగా చదువబడే భారతీయ మతగ్రంథం ఏది? అది ఏ రూపంలో రచించబడింది?

   (ఎ) ఆ గ్రంథంలో ఎన్ని అధ్యాయాలు ఉన్నాయి?

   (బి) ఇది అంతర్భాగంగా గల పెద్ద గ్రంథం ఏది?

   (సి) దీనిని రచించిన ముని ఎవ్వరు?

2. అసలుపేరు వెలుగులోకిరాని సుప్రసిద్ధుడైన భారతీయ నాటకకర్తా, మహాకవీ ఎవ్వరు?

   (ఎ) ఆయన ప్రసిద్ధిగాంచిన ఆ పేరు ధరించడానికి గల కారణం ఏమిటి?

   (బి) ఆయన రచించిన నాటకాలు ఏవి?

   (సి) ఆయన రచించిన కావ్యాలు ఏవి?

3. ఒక ప్రాచీన గ్రంథం ప్రకారం ఒక స్త్రీ కోపావేశానికి గురై ఒక నగరమే మంటలపాలయింది. ఆ నగరం ఏది?

   (ఎ) ఆ స్త్రీ ఎవరు?

   (బి) ఆ గ్రంథం పేరేమిటి? రచించిన వారెవ్వరు? ఏ భాషలో ఎప్పుడు రచింపబడింది?

(VIII పేజీ చూడండి)

## భారతీయ భాషలన్నిటిలోనూ ఒక మాట నేర్చుకుందాం
## ఈ నెల మాట: విద్యార్థి

అస్సామీ: ఛాత్ర; బెంగాలీ: ఛాత్ర; ఇంగ్లీష్: స్టూడెంట్; గుజరాతీ: విద్యార్థి; హిందీ: ఛాత్ర; కన్నడం: విద్యార్థి; కాశ్మీర్: షాగిర్ద్; మలయాళం: విద్యార్థి; మరాఠీ: విద్యార్థి; ఒరియా: ఛాత్ర; పంజాబీ: విద్యార్థి; సంస్కృతం: విద్యార్థిన్; సింధి: సాగిర్దు; తమిళం: మాణవన్; ఉర్దు: తాలిబిల్మ్.

## మీరు నమ్ముతారా?

* భారత ఉపఖండం వెలుపలినుంచి ఆర్యులు భారతదేశానికి వచ్చారా?
* కొలంబస్ అమెరికాను చేరుకున్న మొట్టమొదటి విదేశీయుడా?
* ఒక్క కంగారూ మృగానికి మాత్రమే శరీరంలో సంచీవంటి ఏర్పాటు ఉన్నదా?

కానే కాదు!

* ఈ సిద్ధాంతాన్ని రుజువుచేయడానికి సరైన ఆధారం లేదు. ఇదొక ఊహ మాత్రమే.
* కాదు. నార్వే దేశస్థుడైన లీఫ్ ఎరిక్‌సన్ 1000 వ సంవత్సరం అమెరికాను కనుగొన్నాడు.
* కాదు. ఇటువంటి ప్రత్యేకమైన ఏర్పాటు గల జంతువులలో కంగారూ ఒక్కటి. కోలా ఎలుగు బంట్లూ, ఒపోసమ్స్, వోంబ్యాట్స్ మొదలైనవాటికి కూడా ఇటువంటి ఏర్పాటు ఉన్నది.

# సమాధానాలు

### ఎవరాయన?

మహాకవి కాళిదాసు. సుప్రసిద్ధమైన కథ ప్రకారం అతడొక అమాయకుడు. ఒక యువరాణి, పాండిత్యంలో తనకన్నా గొప్ప వారినే పెళ్ళాడగలనని ప్రకటించింది. ఆమెను పెళ్ళాడడానికి హేమాహేమీలయిన పండితులెందరో ప్రయత్నించి విఫలు లయ్యారు. ఆ పండితులు అవమానం భరించ లేక, కుట్రపన్ని, అమాయకుడైన ఒక యువకుణ్ణి వెదికి తెచ్చి, వాడికి పండితుడి వేషం వేసి, అతడు గొప్ప పండితుడని రాణి నమ్మేట్టు చేసి ఆమెతో వివాహం జరిగేట్టు చేశారు. అసలు విషయం బయట పడగానే యువరాణి ఆగ్రహంతో ఆ యువకుణ్ణి బయటకు గెంటేసింది. ఆ తరవాత జరిగిన కథ మీకు తెలిసినదే!

### చరిత్ర

1. వారణాసి

(ఎ) వరుణ–అసి (బి) గంగతో (సి) జగద్విఖ్యాతి గాంచిన విశ్వనాథ ఆలయం (శివాలయం) ఉండడం వల్ల.

2. బాబర్. తల్లి వంశమైన మంగోలు మాట నుంచి వచ్చిన మొగలువంశం చక్రవర్తిగా పేరొందాడు.

(ఎ) 1526 వ సంవత్సరంలో.

(బి) మొగలు వంశం. (సి) మంగోలు నాయకుడైన చెంఘిజ్‌ఖాన్.

3. అక్బర్‌నామా.

(ఎ) అబుల్‌ఫజల్ (బి) అయిన్-ఇ-అక్బారీ అక్బర్ రాజ్యంలోని జనసంఖ్య, ఇతర వివరాలు గల పుస్తకం ఇది.

4. చేర, చోళ, పాండ్య వంశపు రాజులు.

### విజ్ఞానశాస్త్రం

1. ఫ్రెంచ్ భౌతికశాస్త్ర వేత్త జార్జ్ క్లాడ్. దానిని అతడు ప్రప్రథమంగా 1910 వ సంవత్సరం డిసెంబర్ 3 వ తేదిన ప్యారిస్ మోటార్ షోలో ప్రదర్శనకు ఏర్పాటు చేశాడు.

2. 7,750 మిలియన్ కిలోవాట్ల విద్యుచ్ఛక్తి కలిగి వుంటుంది.

3. 15 నుంచి 20 బిలియన్ సంవత్సరాలు.

4. మిడెల్‌బర్గ్‌లోని కళ్ళద్దాల వ్యాపారి హాన్స్ లిపర్‌షే కనుగొన్నట్టు చెబుతారు. అతడు దానిని 1908 అక్టోబర్ 2 న రూపొందించాడు. అయితే, ఈ పరికరం గురించిన ఆలోచన, అతనివద్ద పనిచేసే కుర్రవాడికి, అతడు అద్దాలతో ఆడుకుంటున్నప్పుడు తట్టినట్టు చెబుతారు.

5. కాదు. సూర్యుడు వేసవికాలంకన్నా చలి కాలంలో 3 మిలియన్ మైళ్ళు భూమికి దగ్గరలో వుంటాడు.

6. కుజగ్రహం భూమికి సమీపంలో ఉన్నప్పుడు ఈ గుర్తు తెలియని ఎగిరే పళ్లాలు ఎక్కువ సంఖ్యలో కనిపిస్తాయి.

7. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో. ప్రపంచం మొత్తంమీద వెలువడే వార్తా పత్రికలలో సగం అమెరికానుంచి, కెనడానుంచి వెలువడుతున్నవి.

8. 72 అడుగుల నరాలు.

9. జిరాఫీ.

10. స్కంక్ జంతువు.

### సాహిత్యం

1. భగవద్గీత, కృష్ణార్జునుల మధ్య జరిగిన సంభాషణల రూపంలో ఉన్నది.

(ఎ) పద్దెనిమిది (బి) మహాభారతం (భీష్మ పర్వంలో) (సి) వ్యాసుడు.

2. కాళిదాసు.

(ఎ) కాళికాదేవి కరుణవల్ల అతడు పండితుడైన కారణంగా. (బి) మాళవికాగ్నిమిత్రం, విక్రమోర్వశీయం, అభిజ్ఞానశాకుంతలం. (సి) రఘువంశం, కుమారసంభవం, మేఘదూతం.

3. మధురై.

(ఎ) కణ్ణగి (బి) సిలప్పదిగారం. ఇళంగో అడిగళ్; తమిళభాషలో దాదాపు రెండువేల సంవత్సరాలకు పూర్వం.



కావ్యకథలు:

# మణిమంజీరం-3

పూంపుహార్ నగరానికి చెందిన యువ వర్తకుడు కోవలన్, కణ్ణగిని వివాహ మాడాడు. అయినా, పెళ్ళయిన కొన్నాళ్ళకే భార్యను వదిలి, అతడు నర్తకి మాధవి చెంతకు చేరాడు. కణ్ణగి ఇంటివద్ద బాధలన్నిటినీ మౌనంగా భరిస్తూ వచ్చింది.

ఒకప్పుడు పూంపుహార్ నగరంలో వేడుకలు జరిగాయి. కోవలన్, మాధవి తమ భవనం మీది నుంచి నగర వీధుల గుండా వెళ్ళే ఊరేగింపులను చూశారు. తాము కూడా ఆ వేడుకలలో పాల్గొనాలని నిశ్చయించారు.





కోవలన్ కంచరగాడిద మీదా, మాధవి ఎడ్లబండిలోనూ ప్రయాణమై వెళుతూ వుంటే సేవకులు వారి వెంట నడిచారు. అందరూ, నగర వీధులను దాటుకుని, వేడుకలు జరుగుతున్న స్థలానికి చేరుకున్నారు.



సుందర సముద్రతీరంలో ఏకాంత ప్రదేశాన్ని ఎంచుకుని, సేవకులు చక్కటి బస ఏర్పాటు చేశారు. రంగు రంగుల తెరలమధ్యా కోవలన్ సేద తీరడానికి మెత్తటి పాన్పు వేశారు. ఆ తరవాత మాధవి మధురంగా పాడడం ప్రారంభించింది.

మాధవి పాడుతూన్న పాటలో, కోవలన్‌కు హఠాత్తుగా వేరొక అర్థం స్ఫురించింది. నిజానికి మాధవి, కోవలన్‌ను తప్ప మరెవ్వరినీ ప్రేమించలేదు. అయితే, కోవలన్‌కు మాత్రం, ఆమె వేరెవరినో తలుచుకుని ఆ పాట పాడుతున్నట్టని పించింది. ఆ క్షణమే అతను అక్కడి నుంచి లేచి వెలుపలికి నడిచాడు.





కోవలన్ కోపంతో తననువదిలి వెళ్ళిన విషయం, మాధవికి కొంతసేపటికి తెలియవచ్చింది. ఆమె ఎంతో బాధతో, ఒంటరిగా ఇంటికి చేరి చెప్పరానంతగా రోదించింది. తన చెలికత్తె ద్వారా కోవలన్‌కు ఒక లేఖ రాసి పంపింది.

మాధవి చెలికత్తె, కోవలన్‌ను వెంబడించి లేఖనూ, పూలదండనూ, అతనికివ్వబోయింది. అయినా, కోవలన్ వాటిని తీసుకోవడానికి నిరాకరించాడు. తన భార్య కణ్ణగి జ్ఞాపకం రావడంతో అతడు ఎంతగానో కుమిలిపోయాడు. విచారంగా ఇంటికేసి నడిచాడు.





ఇంటికి వచ్చిన భర్తకు కన్నీళ్ళతో స్వాగతం పలికింది కణ్ణగి. తను చేసిన పనికి ఎంతగానో పశ్చాత్తాపపడ్డాడు కోవలన్. భార్యకు క్షమాపణలు చెప్పుకున్నాడు.

ఎంతో గొప్పగా సంపన్నజీవితం గడిపిన నగరంలో, కోవలన్ చితికిపోయి పేద బతుకు బతకలేకపోయాడు. వేరొక నగరం చేరుకుని కొత్తజీవితం ప్రారంభించాలనుకున్నాడు. ఏదైనా వ్యాపారం చేద్దామన్నా పెట్టుబడికి ధనం లేదు. అందుకు తన విలువైన పాదమంజీరాలను తీసి చూపింది కణ్ణగి.





కణ్ణగి కాలి అందెలను చూసి కోవలన్ పరమానందం చెంది, "తెల్లవారేలోగా మధురై నగరానికి బయలుదేరుదాం. నీ పాద మంజీరాలను విక్రయించి, ఆ పెట్టుబడితో ఏదైనా వ్యాపారం ప్రారంభించి, నూతన జీవితం ప్రారంభిస్తాను. ఇకెప్పుడూ జీవితంలో పొరబాటు చేయను," అన్నాడు.

వేకువజాముననే ఆలుమగలు ఇల్లు వదిలిపెట్టారు. తాము పుట్టిపెరిగిన సుసంపన్నమైన పూంపుహార్ నగరం వదిలి పెట్టి, మధురై కేసి ప్రయాణం సాగించారు.






మధురై, పూంపుహార్‌కు చాలా దూరంలో ఉన్నది. పగటిపూట నడుస్తూ, రాత్రులను దేవాలయాలలోనూ, సత్రాలలోనూ గడుపుతూ, అడవులూ, నదులూ దాటుకుంటూ, కణ్ణగి కోవలన్ దంపతులు తమ గమ్యస్థానం కేసి ప్రయాణం సాగించారు.

—(ముగింపు వచ్చే సంచికలో)



# శ్రమ విలువ

గంగాపురం జమీందారుగారి దివాణంలో, వెంకటాచారి అనే స్వర్ణకారుడుండేవాడు. అతడి వంశంవాళ్ళు, ఎన్నో ఏళ్ళుగా గంగాపురం జమీందార్లకు నగలూ, యితర ఆభరణాలూ తయారు చేస్తూ సుఖంగా బతుకుతున్నారు. వాళ్ళకు దివాణం వాళ్ళిచ్చిన ఇల్లూ, కొద్ది ఈనాం పొలం వుండేది.

వెంకటాచారికి, వరదాచారి అనే ఒక కొడుకు. వాడు మహాబద్ధకస్తుడు. కష్టపడి పని చేయడం వాడికిష్టముండేదికాదు. తాను బతికుండగానే కొడుకును తనంతటి స్వర్ణకారుణ్ణి చేయాలని,వెంకటాచారితపన పడుతూండేవాడు. అయితే, వరదాచారికి పని అంతగా అబ్బలేదు.

తండ్రి పోయేనాటికి వరదాచారి పదిహేనేళ్ళవాడు. వాడు పనినేర్చుకోవడం పూర్తిగా మానివేసి, తండ్రి సంపాయించి పోయిన దానిని ఖర్చుపెడుతూ తిరుగుతూండేవాడు.

ఒకసారి వరదాచారికి దివాణంనుంచి కబురు వచ్చింది. జమీందారు వాడికి నగల తయారీని అప్పగించబోతే, కుంటిసాకులు చెప్పి తప్పించుకుని వచ్చేశాడు.

ఇది తెలిసి, వాడి తల్లి చాలా బాధపడుతూ, ''ఒరే, నాయనా, దివాణం పని దేవుడి వరంలాంటిది. నువ్వు వారిచ్చిన పని ఒప్పుకోవలసింది,'' అన్నది.

''నాకు పని బాగారాదుగదమ్మా. ఒప్పుకుని ఏం చెయ్యను, ఎలా చెయ్యను?'' అన్నాడు వరదాచారి.

''ఆపని చేతనైనవాళ్ళ చేత, నగలు చేయించవచ్చు. వాళ్ళకు రోజుకు యింత కూలి అని జమీందారుగారిచ్చే మజూరీలో నుంచి చెల్లించి, మిగిలినది ప్రతిఫలంగా తీసుకో,'' అని సలహాయిచ్చింది, తల్లి.

బొమ్మిడి అచ్చారావు



వరదాచారి వెంటనే దివాణానికి వెళ్ళి, జమీందారు దర్శనం చేసుకుని, నగలు చేసి యివ్వగలనన్నాడు. జమీందారు వాడికి ఎలాంటి నగలు తయారు చేయాలో చెప్పి, అందుకు ఎంత బంగారం, ఎన్ని రత్నాలు కావాలో చెప్పమన్నాడు.

తనకు నగలు తయారుచేయడం తెలియదని, జమీందారు ముందు బయట పడిపోవడం మంచిది కాదనుకుని, వరదాచారి ఆయనతో, "రేపు ఉదయం వచ్చి మనవి చేసుకుంటాను, ప్రభూ!" అని చెప్పి, వివరాలు రాసుకుని వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత, వరదాచారి తన తండ్రికి సన్నిహితులైన స్వర్ణకారుల్ని కలుసుకుని, వివరాలు సేకరించాడు. వాళ్ళు వరదాచారిలో వచ్చిన మార్పుకు ఆశ్చర్యం, ఆనందం కూడా పొందారు.

జమీందారు, నగలకు కావలసిన బంగారం, రత్నాలూ వరదాచారికి యిప్పించాడు. వాడు వాటిని ఇంటికి తీసుకుపోయి, తన తండ్రికాలంలో పనిచేసిన నమ్మకస్థులైన వాళ్ళచేత, వాటిని తయారు చేయించడం ప్రారంభించాడు.

జమీందారు, వాడికి మజూరీకిగాను ముందుగా డబ్బివ్వలేదు. ఆ కారణం వల్ల, వరదాచారి వాళ్ళకు కూలికింద తన డబ్బు యివ్వసాగాడు. అయితే, వాడికి అంతగా పని తెలియదని ఎరిగిన స్వర్ణకారులు, నాలుగు రోజుల్లో అయ్యే పనిని వారంరోజులపాటు చేస్తూ వచ్చారు. దానితో వరదాచారి వాళ్ళకు చెల్లించవలసిన కూలి రెట్టింపయింది.

నగలు పూర్తయేలోపల బంగారంలో తరుగు వచ్చింది. దాన్ని జమీందారు నుంచి అడిగితీసుకోవడం సాధ్యపడదు. వరదాచారి తన డబ్బు చెల్లించి బంగారు కొని పని పూర్తిచేయించాడు.

వరదాచారి నగలు తీసుకుని, దివాణానికి వెళ్ళాడు. జమీందారు వాటి పనితనం మెచ్చుకుని, పది వరహాలు ఎంచి, మజూరీకింద వాడికిచ్చాడు.

వరదాచారి నిర్ఘాంతపోయాడు. తన డబ్బు వెచ్చించి కొన్న బంగారంతో కలుపుకుని, స్వర్ణకారులకిచ్చిన కూలీ నూరు వరహాలయింది. జమీందారిచ్చినది పదివరహాలు!

జమీందారు, వాడికేసి పరీక్షగా చూస్తూ, "నీ తండ్రికి యిలాంటిపనికి, ఎనిమిది వరహాలిచ్చేవాడిని. నీ పనితనం నచ్చి, మరొక రెండు వరహాలు అదనంగా యిచ్చాను. ఇదుగో, మరికొన్ని నగలు చెయ్యాలి. పనెప్పుడు మొదలుపెడతావు? నాకు కేవలం అయిదురోజుల్లో నగలు కావాలి," అన్నాడు.

వరదాచారి నగలు చెయ్యనని చెబుదామనుకున్నాడు. కాని, జమీందారును కాదనగల ధైర్యం, ఆ పరగణాలో ఎవరికీ లేదు. తనెంత?

వరదాచారి సమాధానం చెప్పేలోపలే, జమీందారు నగలు చెయ్యడానికి కావలసిన బంగారం, రత్నాలూ తెప్పించి, "ఈ పనికి ఎంత బంగారం కావాలో ముందుగానే తెలుసుకుని, నీకు శ్రమ తగ్గించాను!" అన్నాడు నవ్వుతూ.

వరదాచారి అయిదురోజుల్లో పని పూర్తి చేసి, జమీందారుకు నగలు అప్పగించాడు. అందుకుగాను వాడికి నూటయాభైవరహాలు ఖర్చయితే, జమీందారుపదిహేనువరహాలు మాత్రమే మజూరీకింద యిచ్చాడు.

తర్వాత, ఆయన వరదాచారికి మరి కొన్ని నగలు చేసే పని అప్పగించాడు.



వాడు, ఇంటికిపోయి జరిగినది తల్లికి చెప్పి, కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు.

ఆమె వాణ్ణి ఓదార్చుతూ, "నాయనా, నువ్వు మీ నాన్నగారిదగ్గిర కొంత పని నేర్చుకున్నావు. ఇప్పుడు, యీ నగలు చేసే స్వర్ణకారుల పని పద్ధతులు గమనిస్తున్నావు. నువ్వే కాస్త శ్రమపడి, ఆ నగలు తయారుచేసి, వాళ్ళకిచ్చేకూలి మిగుల్చుకోరాదా," అన్నది.

వరదాచారికి తల్లి మాటలు నచ్చాయి. వాడు అహోరాత్రులు శ్రమించి, నగలు తయారు చేశాడు. జమీందారిచ్చిన బంగారంలో వీసమెత్తు కూడా తరుగు రాలేదు. నగలు కూడా నాణ్యంగా, మనోహరంగా తయారయాయి. తల్లి వాటిని చూసి చాలా సంతోషించి, వరదాచారిని గొప్ప పనిమంతుడివి అవుతావని ఆశీర్వదించింది.

వరదాచారి వాటిని తీసుకుని, జమీందారు దగ్గిరకు వెళ్ళాడు. ఆయన వాటి పనితనం మెచ్చుకుని, రెండు వరహాలు వరదాచారి కిచ్చాడు.

వరదాచారికి విపరీతమైన కోపం, ఉక్రోషంవచ్చింది. వాడు, జమీందారుతో, "ప్రభూ, తమకు శ్రమవిలువ తెలియదు. ఇలాంటి పని మరెక్కడైనా చేసుకుంటే, నాకు హాయిగా జీవితం గడిచిపోతుంది. సెలవిప్పించండి!" అన్నాడు.

ఆ మాటలకు జమీందారు నవ్వి, "అయితే, యీ నగలు నువ్వు నీ స్వహస్తాలతో చేశావన్నమాట! అవునా?" అన్నాడు.

వరదాచారి ఆశ్చర్యంగా, జమీందారుకేసి చూశాడు. ఆయన వాడి భుజం తట్టి, "ఇన్నాళ్ళూ, నేనిచ్చిన మజూరీ తక్కువని, నువ్వనలేదు. అంటే, నీ సొంత డబ్బు కొంత పోయిందేతప్ప, నీ శ్రమ విలువకు నష్టం కలగలేదు. ఇప్పుడు శ్రమవిలువను నువ్వు గ్రహించావు. నాక్కావలసింది అదే! నీ తండ్రి కోరిక, యీనాడే తీరింది. ఇక నుంచి దివాణానికి ప్రధాన స్వర్ణకారుడివి, నువ్వే!" అంటూ వెయ్యివరహాలు అదనంగా యిచ్చి సత్కరించి పంపాడు.






# కృష్ణావతారం

గోకులానికి ఎలాటి బట్టలతో వెళ్ళాడో వాటితోనే బలరాముడు మధురకు వచ్చి, తిన్నగా కృష్ణు డింటికి వెళ్ళాడు. కృష్ణు డతని పాదాలకు నమస్కారం చేసి, స్వాగతం తెలిపాడు. తరవాత అన్నదమ్ము లిద్దరూ వసుదేవుడి ఇంటికి వెళ్ళారు. వసుదేవుడు బలరాముణ్ణి కౌగలించుకుని, విశేషాలు అడిగాడు. బలరాముడు గోకులంలో తాను చేసిన ఘనకార్యం ఒకటి చెప్పాడు.

అతను ఒకనాడు తాను కూర్చున్న చోటినుంచి కాళిందీనదిని పిలిచి, తన దగ్గిరికి వచ్చి, తన చేత స్నానం చేయించమన్నాడు. కాళిందీనది రాలేదు. బలరాముడికి కోపం వచ్చింది. అతను తన నాగలిని కాళిందికి వేసి లాగాడు. ఆ విధంగా బృందావనానికి కాళింది కాలువ ఒకటి ఏర్పడి, గోపకులకు చాలా ఉపకారం జరిగింది.

కొంతకాలం గడిచింది. ఒకనాడు కృష్ణుడు యాదవుల సభలో ఒక ప్రతిపాదన ఈ విధంగా చేశాడు:

''మనం నివసించే ఈ మధుర లాటిది ప్రపంచంలో మరొకటి లేదు. ఇలాటి క్షేత్రం కూడా మరెక్కడా ఉండదు. మేం వ్రేపల్లెలో పెరిగినా, పుట్టటం ఇక్కడే పుట్టాం. ఇక్కడికే తిరిగి వచ్చి సకలైశ్వర్యాలూ సంపాదించుకున్నాం. అయితే, ఇక్కడ మనకు శత్రుబాధ జాస్తి అయింది. ప్రపంచంలో ఉండే రాజు

15. ద్వారవతీ నిర్మాణం



కృష్ణుడు చెప్పిన మాటలు యాదవులకు సరిగా ఉన్నట్టే తోచాయి. జరాసంధుణ్ణి చంపటం సాధ్యం కాదు. అతని వెనక అంతులేని సేనలుంటున్నాయి. యుద్ధం చెయ్యవచ్చు. ఆ యుద్ధం ఎప్పటికీ తెగదు. జరిగేదల్లా ఉభయ పక్షాలవారూ నాశనం కావటం. కృష్ణుడు నిరపాయ స్థలం చూపే పక్షంలో అక్కడికి పోవటమే మంచిదని యాదవనాయకులనుకున్నారు.

కృష్ణుడు యాదవుల నందరినీ ఫలాని చోటికి తీసుకుపోవాలని తన మనసులో నిశ్చయించుకుని, అందరినీ ప్రయాణ సన్నాహాలు చేయమన్నాడు.

లందరూ జరాసంధుడి వెంట ఎత్తివచ్చి, ఎటువంటి హింసాకాండ జరిపారో మీరు చూశారు కద! ఈ ప్రమాదం తుదముట్ట లేదు. మనకు మంది మార్బలం ఉన్నది. ఏనుగులూ, గుర్రాలూ, రథాలూ ఉన్నాయి. పుష్కలంగా బంగారమూ, రత్నరాసులూ ఉన్నాయి. కాని ఏం లాభం? మన శత్రువులు వచ్చి పడ్డప్పుడల్లా మనం మన కున్నది నష్టపోతున్నాం. ఇది సహించరానిది. అందుచేత మనం ఇక్కడి నుంచి వెళ్ళిపోవటం నాకు కర్తవ్యమనిపిస్తున్నది. మనం ఉండటానికి మరొక ప్రదేశం చూస్తాను. అక్కడికి పోయి సుఖంగా ఉందాం.''

ఇదే సమయంలో కాలయవను డనే వాడు మధుర మీదికి సైన్యాలతో సహా బయలుదేరాడనీ, జరాసంధుడు కూడా అదే ప్రయత్నం ప్రారంభించాడనీ తెలియ వచ్చింది. ఈ సంగతి వింటూనే కృష్ణుడు, ''మనం ఇవాళే బయలుదేరుదాం. ఈ రోజు చాలా బాగుంది,'' అని తన వారికి చెప్పాడు.

వసుదేవుడూ, ఉగ్రసేనుడూ, బలరామ కృష్ణులూ, వారి వెంట వృష్ణి, అంధక వీరులూ, వారి కుటుంబాలూ, అంతులేని ఏనుగులతో, రథాలతో, గుర్రాలతో తమ సంపద లన్నిటినీ వెంట తీసుకుని మధురా నగరం విడిచి, పడమటి దిక్కుగా

ప్రయాణమయారు. వారు అలా రోజూ ప్రయాణం చేస్తూ పశ్చిమ సముద్రతీరాన్ని చేరుకున్నారు. అది అనేక చెట్లతోపులతో కూడుకుని ఉన్న గరువు ప్రదేశం. ఆ ప్రాంతంలోనే పూర్వం ఏకలవ్యుడు ద్రోణాచార్యులను పూజించాడు.

ఎక్కడ ఇళ్ళు కట్టాలో, ఎక్కడ తోటలు పెంచాలో, ఎక్కడ నీటి సదుపాయా లున్నాయో బాగా ఆలోచించి, అక్కడ ఒక అందమైన నగరం నిర్మించి, దానికి ద్వారవతి అని పేరు పెట్టారు. అందరికీ నగరంలో మంచి ఇళ్ళు ఏర్పాటయాయి. యాదవులకు శత్రుభయం తీరిపోయింది. వాళ్ళు సుఖంగా నిశ్చింతగా ద్వారవతిలో జీవించసాగారు. అయితే ద్వారవతీ నిర్మాణానికి ముందు చాలా కథ నడిచింది.

ఎటువంటి శత్రువునూ లక్ష్యపెట్టని కృష్ణుడు కాలయవనుడికి వెరిచి, మథుర విడిచిపెట్టి, పడమటి సముద్రాన నగరం నిర్మించుకోవటానికి కారణం ఉన్నది. అదొక చిన్న కథ.

ఒకప్పుడు వృష్ణి, అంధకకులాలవారికి గర్గుడని ఒక గురువు ఉండేవాడు. అతను ఆజన్మబ్రహ్మచర్యం అవలంబించాడు. గర్గుడు యాదవుల మధ్య ఉండగా ఒకసారి ఎవడో ఆయనను చూసి, మగవాడు



కాదు, ఆడది అని అపహాస్యం చేశాడు. యాదవులు ఆ మాట విని ఊరుకున్నారు గాని తమ ఆక్షేపణ తెలపలేదు.

గర్గుడికి మండిపోయింది. అతను అడవికి వెళ్ళి, పన్నెండేళ్ళపాటు లోహచూర్ణం తింటూ, అతి ప్రచండమైన తపస్సు చేసి, శివుణ్ణి ప్రత్యక్షం చేసుకుని, వృష్ణి, అంధకులను పీడించగల కొడుకు తనకు కలిగేటట్టు వరం పొందాడు. ఈ సంగతి తెలిసి, కొడుకులు లేని యవనేశ్వరుడు, అతన్ని పిలుచుకుపోయి, తన గోవుల మందల మధ్య అతనికి నివాసం ఏర్పాటుచేసి, అతనికి కావలసిన ఏర్పాట్లన్నీ చేశాడు.




గర్గుడు అలా గోవుల మందల మధ్య నివసిస్తూండగా, ఒక అప్సరస గోపిక రూపంలో అతని వద్దకు వచ్చి, ఈశ్వరా దేశం ప్రకారం గర్భవతి అయి, కాలయ వనుణ్ణి కన్నది. ఆ కుర్రవాణ్ణి యవనరాజు తన కొడుకుగా పెంచి, పెద్దవాణ్ణి చేశాడు. కాలయవనుడు గొప్ప తేజోవంతుడూ, పరాక్రమవంతుడూగా పెరిగాడు. అతను ఎంతటివారినీ ఏమాత్రం లక్ష్యపెట్టేవాడు కాడు.

ఒకనాడు యవనరాజు వద్దకు నారదుడు వచ్చాడు. అప్పుడు కాలయవను డాయనను, "ప్రపంచంలో గొప్ప వీరు లెవరు?" అని అడిగాడు.

"ఈనాడు యాదవులను మించిన వీరులు ప్రపంచంలో లేరు," అంటూ నారదుడు చాలా గొప్పగా వర్ణించి చెప్పాడు. నారదుడి మాటలు వింటున్న కొద్దీ కాలయ వనుడికి మాత్సర్యం పుట్టుకొచ్చింది. శక వంశానికి చెందిన రాజులూ, హిమా లయంలో ఉండే దస్యులూ అతనెలా చెబితే అలా నడుచుకుంటారు. అందుచేత వారి నందరినీ చేర్చి ఒక సేనగా తయారు చేసి, ఏనుగులనూ, గుర్రాలనూ, గాడిద లనూ అమితంగా వెంటబెట్టుకుని, మధుర మీదికి కాలయవనుడు బయలుదేరాడు.

ఈ సంగతి నారదుడి వల్లనే విని కృష్ణుడు పరిస్థితి అంతా చక్కగా ఆలో చించి, మధుర విడిచి వెళ్ళటమే కర్తవ్య మని నిశ్చయించుకున్నాడు. తానీ నిశ్చ యానికి రాగానే యాదవులను హెచ్చ రించాడు.

కృష్ణుడు మరొక పని కూడా చేశాడు. అతను ఒక కుండలో ఒక కాలసర్పాన్ని ఉంచి, దానికి వాసెన కట్టి, ఒక దూత చేతికిచ్చి కాలయవనుడి దగ్గిరికి పంపుతూ, ఇలా చెప్పమన్నాడు: "ఈ కుండలో ఉన్న కాలసర్పం లాటిది కృష్ణుడి పరాక్రమం."

ఆ మాట విని కాలయవనుడు ఏమీ అనక, కాలసర్పం ఉన్న కుండలో కండ చీమలను కొన్నిటిని వేసి, మళ్ళీ వాసెన

కట్టి, దాన్ని తీసుకుపోయి కృష్ణుడి కియ్యమన్నాడు. "నువు ఎంత బలవంతుడివైనా, అనేక మంది మధ్య ఒంటరిగా చిక్కితే నీ బలం ఎందుకూ పనికిరాదు," అని కాలయవనుడి సందేశం. దాని అంతరార్థం గ్రహించి కృష్ణుడు మధురా నగరం నుంచి, యాదవు లందరితోనూ బయలుదేరాడు.

అతను ద్వారవతి నుంచి నిరాయుధుడుగా, కాలినడకన బయలుదేరి తన శత్రువు ఉండే నగరం చేరాడు. అక్కడి వాళ్ళు కృష్ణుణ్ణి గుర్తించి, "చుట్టుముట్టండి, పట్టుకోండి," అని ఆర్భాటం చేశారు.

ఈ లోపల కృష్ణుడి రాక విన్న కాలయవనుడు తాను కూడా నిరాయుధుడూ, పాదచారీ అయి కృష్ణుడికి ఎదురు వచ్చి, కృష్ణుణ్ణి సమీపించాడు. కాని కృష్ణుడు అతనికి చేయి ఇవ్వబోయేవాడి లాగా నటిస్తూ, ఇవ్వకుండానే అతి వేగంగా ఒక గుహలో ప్రవేశించాడు.

ఆ గుహలో ముచికుందు డనేవాడు నిద్రపోతున్నాడు. ఈ ముచికుందుడు మాంధాత కొడుకు. అతను దేవాసుర యుద్ధంలో చాలా కాలం యుద్ధం చేసి, దేవతలకు విజయం చేకూర్చి, శ్రమ తీరటానికి నిద్రపోబోతూ, తనకు నిద్రా




భంగం కలిగించిన వాణ్ణి తన చూపులతోనే భస్మం చేసేటట్టు వరం పొందాడు. ఈ సంగతి కృష్ణుడికి తెలుసు. అతను గుహలో ప్రవేశిస్తూనే ముచికుందుడి తల వైపున దాక్కున్నాడు.

అతని వెనకగా గుహలోకి వచ్చిన కాలయవనుడు, నిద్రపోతున్న ముచికుందుణ్ణి చూసి, కృష్ణుడేనని భ్రమపడి, కాలితో తన్ని, "ఇలా చావు తప్పించుకుందా మనుకుంటున్నావా? లే, లే. నీ బలం తెలిసింది," అంటూ వికటాట్టహాసం చేశాడు.

నిద్రాభంగం కలిగి ముచికుందుడు లేచి కూర్చుని, కాలయవనుడి కేసి



కోపంగా చూశాడు. మరుక్షణమే కాల యవనుడు, పిడుగుపడిన చెట్టులాగా అయి, నిలువునా లేచిన మంటలలో బూడిద అయిపోయాడు.

తరవాత కృష్ణుడు తాపీగా ముచికుందుడి ఎదటపడి, ''అయ్యా, నీ విక్కడ ఉన్న సంగతి నాకు నారదుడి ద్వారా తెలిసింది. నా పని నీ మూలాన నెరవేరింది. తృప్తిపడ్డాను. ఇక వెళ్ళివస్తాను,'' అన్నాడు.

ముచికుందుడు కృష్ణుణ్ణి చూసి, ''అయ్యా, నీ వెవరు? ఇక్కడికి ఏం పని మీద వచ్చావు? నాకు నిద్రాభంగం కలిగించిన ఈ మనిషి ఎవరు? నేనిక్కడ ఎంతకాలంగా నిద్రపోతున్నాను? తెలిస్తే చెప్పు,'' అన్నాడు.

దానికి కృష్ణు డిలా చెప్పాడు:

''చంద్రుడికి సాటి అనదగినవాడు నహుషుడు. ఆయన కొడుకు యయాతి. యయాతికి అయిదుగురు కొడుకులు. వారందరిలోకీ పెద్దవాడు యదువు. ఆ యదువు సంతతిలో వసుదేవుడనే మహనీయుడు పుట్టాడు. ఆ వసుదేవుడికి దేవకి అనే భార్య యందు నేను పుట్టాను. ఆయనకు రోహిణి అనే భార్య యందు పుట్టిన బలరాముడికి తమ్ముణ్ణి, నన్ను వాసుదేవుడంటారు. నీ కోపాగ్నికి అహుతి అయిన ఇతను కాలయవను డనే ప్రసిద్ధుడు, వరంవల్ల పుట్టినవాడు. మరొక విధంగా చావనివాడు, నా శత్రువు. నీవు త్రేతా యుగంలో పుట్టినట్టు విన్నాను. ఇప్పుడు కలియుగం సమీపిస్తున్నది.''

ముచికుందుడు గుహ నుంచి బయటికి వస్తూ తిరిగి రాజ్యం చేసుకుందా మనుకున్నాడు. కాని తీరా భూమి మీద సంచరించే మనుషుల అల్పప్రమాణమూ, అల్పబుద్ధులూ, అల్పపరాక్రమమూ చూస్తే ఆయనకు రాజ్యాలేలా లనిపించలేదు. అందుచేత ఆయన తపస్సు చేసుకోవటానికి హిమాలయారణ్యాలలోకి వెళ్ళిపోయాడు.

తన ప్రబల శత్రువు చనిపోయాక, కృష్ణుడు కాలయవనుడి సేనలోని ప్రధాన వీరులను తనదివ్యాస్త్రాలతో అనాయాసంగా చంపేసి, మిగిలిన సేనలను తన వశం చేసుకుని, అతి వేగంగా వెళ్ళి తన వారిని చేరుకున్నాడు. ఇదంతా జరిగాకనే ద్వారవతీనగర నిర్మాణం జరిగింది.

ద్వారవతి నిర్మాణానికి విశ్వకర్మ సహాయం పొంద నిశ్చయించి కృష్ణుడు ఆ దేవశిల్పిని స్మరించాడు. వెంటనే విశ్వకర్మ ప్రత్యక్షమై, ''నన్నెందుకు స్మరించావు? నావల్ల ఏం పని కావాలి?'' అని అడిగాడు.

''స్వర్గంలో ఇంద్రుడి నగరం ఎలా ఉత్తమంగా ఉంటుందో, భూలోకంలో అలా ఎటువంటి లోటూ లేని సర్వోత్తమంగా ఉండే నగరాన్ని నాకు కట్టిపెట్టాలి,'' అన్నాడు కృష్ణుడు.

''ఈ జనాని కంతకూ తగిన నగరం నిర్మించాలంటే ఇప్పుడు ఇక్కడ ఉన్న ప్రదేశం చాలదు. సముద్రం కొంత వెనక్కు పోయినట్టయితే, ఆ ప్రదేశంలో చక్కని విశాలనగరం నిర్మించవచ్చు.'' అన్నాడు విశ్వకర్మ.

కృష్ణుడు సముద్రుణ్ణి ప్రార్థించాడు. తక్షణమే సముద్రుడు ప్రత్యక్షమై, ఎటు చూసినా పన్నెండు యోజనాలుండేటట్టుగా భూమి వదిలి, తాను వెనక్కు వెళ్ళిపోయాడు.

అప్పుడక్కడ విశ్వకర్మ దివ్యమైన నగరాన్ని నిర్మించాడు. బంగారపు కోటా, ఆకాశాన్ని అంటే మణిగోపురాలూ, ఎత్తయిన ప్రాసాదాల వరసలూ, హర్మ్యాలూ, చక్కని రాజమార్గమూ, చైత్యాలూ, సభలూ, చావడులూ, తోరణాలూ, బురుజులూ, బావులూ, సరస్సులూ, కల్పిత శిలోద్యానాలూ అవతరించాయి. రాజభవనంలో కృష్ణుడు ఉన్నతాసనంలో కూర్చుంటే, యాదవప్రముఖు లందరూ సభతీరారు. కృష్ణుడు విశ్వకర్మను సముచితంగా సత్కరించి ఇంద్రలోకానికి పంపేశాడు.






# వనదేవతహెచ్చరిక

ఒకానొక గ్రామంలో, చమటకు డనే వ్యాపారి వుండేవాడు. ఒక్కసారిగా వ్యాపారంలో అమితమైన నష్టం రావడంవల్ల అప్పులపాలై, ఆయన ఉన్నదంతా పోగొట్టుకుని, కట్టుబట్టలతో బికారిగా మిగిలాడు.

ఇక ఆ గ్రామంలో నలుగురికీ ముఖం చూపించలేక భార్య, ముగ్గురు పిల్లలతో మరొక గ్రామానికి బయల్దేరాడు. దారిలో ఆయన కొక సాధువు ఎదురై, "నీవు చమటకుడివి కదూ! ఎంత వైభవంగా జీవిస్తూ, సాధువులను భక్తిశ్రద్ధలతో సత్కరించేవాడివి. ఇప్పుడు నిన్ను చూస్తూంటే, ఏదో దుర్గతికి గురైనట్లు తోస్తున్నది. ఏం జరిగిందీ చెప్పు," అని అడిగాడు.

చమటకుడు తన దురదృష్టాన్ని సాధువుకు చెప్పుకున్నాడు. సాధువు వెంటనే, "నీవంటి మంచివాడికి రావలసిన కష్టం కాదిది. అయితే, నీవు జీవితంలో ఎప్పుడూ శ్రమపడకుండా, శ్రమజీవుల కష్టం మీదనే బాగుపడ్డావు. కొంతకాలంపాటు శరీర శ్రమతో జీవించు. మళ్ళీ మంచి రోజులు వస్తాయి. ఆ తర్వాత కూడా శరీరశ్రమను వదిలిపెట్టకు," అని సలహా యిచ్చాడు.

"స్వామీ, మీ సలహా తప్పకపాటిస్తాను. పువ్వులమ్మిన ఊళ్ళో కట్టెలమ్మలేక పొరుగూరు పోతున్నాను. అక్కడ నేనెలా జీవించాలో, మీరే ఉపదేశించండి," అన్నాడు చమటకుడు వినయంగా.

సాధువు కొంచెంసేపాలోచించి, "సుకుమారంగా బ్రతికినవాడివి, ఒక్కసారిగా శ్రమపడాలంటే యిబ్బంది అవుతుంది. అందుకని, నీకొక వరమిస్తున్నాను. శ్రమతో కూడిన ఏ పని అయినా సరే, నువ్వు అదే శ్రమచేసే యితరులకన్న పదింతలు తక్కువ శ్రమతో సాధించగలవు," అన్నాడు.

"వసుంధర"



''ఇక్కడికి దూరంగా వృక్షారణ్య మున్నది. అందులో వంటచెరుకుగా పనికి వచ్చే చెట్లున్నాయి. కాని, అక్కడికి వెళ్ళినవాళ్ళెవరూ తిరిగి రావడం లేదు. కారణం తెలియదు. నీవక్కడికి వెళ్ళి కట్టెలుకొట్టి, సమీప రాజధానీ నగరంలో అమ్మితే మంచి ధర పలుకుతుంది,'' అని కట్టెలు కొట్టేవాళ్ళు సలహా యిచ్చారు.

చమటకుడు, భార్యాబిడ్డలతో వృక్షారణ్య సమీపానికి చేరుకున్నాడు. అక్కడ ఆయన, భార్యతో, ''నీవు నా కారణంగా చాలా శ్రమపడుతున్నావు. నీవూ, పిల్లలూ అరణ్యంలోకి రావద్దు. నా కోసం ఒక రోజంతా ఎదురుచూడు. నేను తిరిగివస్తే, మనం హాయిగా జీవించవచ్చు. లేదా నీవు నాలుగిళ్ళలో దాసీగానైనా పని చేసి, మన పిల్లలను పైకి తీసుకురా,'' అన్నాడు.

దానికి చమటకుడి భార్య, ''ప్రమాదకరమైన అరణ్యంలో అడుగు పెడుతున్నారు. ఇలాంటప్పుడే మీకు తోడు అవసరం. బ్రతికితే కలిసి బ్రతుకుదాం. అలా కానప్పుడు, అందరం కలిసే బ్రతుకులు ముగిద్దాం,'' అన్నది.

కొంతదూరం వెళ్ళాక, చమటకుడు మంచి వృక్షాన్నొకదాన్ని ఎన్నుకుని, నరకడానికై గొడ్డలి ఎత్తాడు. ఎత్తిన గొడ్డలిని దింపేలోగా, ఆయన కొక భయం

చమటకుడు, సాధువు యిచ్చినవరాన్ని మహాప్రసాదంగా భావించి, ఆయనకు నమస్కరించి, భార్యాబిడ్డలతో పొరుగూరు వెళ్ళాడు.

అక్కడ అతను, ఒక గొడ్డలి సంపాయించి, దాపులనున్న అడవికేసి బయలుదేరాడు. అయితే, ఆ ఊళ్ళో కట్టెలుకొట్టి జీవించేవాళ్ళు చాలా మంది వున్నారు. వాళ్ళందరూ ఒక్కటై చమటకుడికి అడ్డు తగిలారు.

చమటకుడు, వాళ్ళతో వినయంగా, ''అయ్యలారా, నేను నా భార్యాబిడ్డలను పోషించుకునేందుకు, వేరు మార్గమేదైనా వుంటే తమరే చెప్పండి,'' అన్నాడు.

కరమైన నవ్వు వినిపించింది. ఆ మరు క్షణం ఆ వృక్షం ఒక భయంకరాకారుడిగా మారిపోయి, "నా జోలికి రాకు. నిన్నూ నీ కుటుంబాన్నీ మింగేస్తాను!" అనడంతో చమటకుడు కొద్దిసేపు దిగ్భ్రాంతుడైపోయాడు.

"పోండి! త్వరగా యిక్కణ్ణించి పారిపోండి. లేకుంటే నేను మిమ్మల్నందర్నీ మింగేస్తాను!" అన్నాడా భయంకరాకారుడు మరొకసారి హెచ్చరిస్తూ.

చమటకు డప్పటికి తేరుకుని, "నీవు నన్నూ, నా కుటుంబాన్నీ మింగేస్తానంటే, నాకేమీ అభ్యంతరం లేదు. నేనిక్కడికి కట్టెలు కొట్టుకునేందుకు వచ్చాను తప్ప, తప్పేమీ చేయలేదు. మనిషి శరీరశ్రమతో జీవించాలనుకున్నప్పుడు, వారించడం నీ తప్పు." అన్నాడు.

వెంటనే భయంకరాకారుడు, తిరిగి మహావృక్షంగా మారిపోయాడు. చమటకుడు, యీ విచిత్రాని కాశ్చర్యపడుతూనే మళ్ళీ గొడ్డలిని పైకెత్తాడు.

"ఆగు, చమటకా!" అన్న మాటలు వినిపించి, చమటకుడు ఆగిపోయాడు.

అప్పుడొక దేవత ప్రత్యక్షమై, "చమటకా! నేను వనదేవతను. ఈ వనంలోని వృక్షాలనూ, జంతువులనూ నేను సంరక్షిస్తూంటాను. ఇక్కడున్న ప్రతి వృక్షాన్నీ ఆశ్రయించుకుని, ఎన్నో ప్రాణులు జీవిస్తున్నాయి. నీవు మా జోలికి రాకు. నీవద్ద మహిమగల గొడ్డలి వుండడంవల్ల,





క్రూరమృగాలు నీ కుటుంబాన్నీ, నిన్నూ ఏమీ చేయలేకపోయాయి. వృక్షం రాక్షస రూపంలో బెదిరించినా, నీవు భయపడలేదు. అందువల్ల నేనే స్వయంగా వచ్చాను. నా మాట విని, యీ వనం వదిలి వెళ్ళిపో,'' అని కోరింది.

చమటకుడు, ఆశ్చర్యంగా, ''అమ్మా, నీవు చెప్పింది బాగానే వున్నది. కాని, నాకొక చిన్న కుటుంబం వున్నది. నేను వాళ్ళను పోషించుకోవాలి. అందుకు నేనేం చేయాలో చెప్పు,'' అన్నాడు.

''నీవేం చేయాలో, నీ దేశపు రాజు చెబుతాడు. రాజాజ్ఞకు మనుషులతోబాటు, దేవతలు కూడా తలవంచక తప్పదు. ఆయన చెబితే, నేను కూడా నిన్నడ్డగించను,'' అన్నది వనదేవత.

''సరే, అయితే రాజుగారినే కలుసుకుంటాను. కాని, అందుకు ఎంతకాలం పడుతుందో ఏమో?'' అన్నాడు చమటకుడు.

వనదేవత, చమటకుణ్ణి కళ్ళు మూసుకోమన్నది. ఆయన అలాగే చేశాడు.

ఇప్పుడు కుటుంబంతోపాటు చమటకుడు, ఒక నిండు సభలో వున్నాడు. కొలువు తీరివున్న రాజూ, సభికులూ హఠాత్తుగా తమ ముందు ప్రత్యక్షమైన, ఆ కుటుంబాన్ని చూసి ఆశ్చర్యపడ్డారు. చమటకుడు వారికి తన కథ చెప్పుకున్నాడు.

రాజు, చమటకుడితో, ''నీవు, నా దేశ పౌరుడివి. నిన్ను సంరక్షించుకోవలసిన బాధ్యత నాది. నీ అర్హతకు తగ్గ ఉద్యోగం యిస్తాను. హాయిగా జీవించు,'' అన్నాడు.

చమటకుడు దీనికి అభ్యంతరం చెబుతూ, ''సాధువు నాకు వరం యిచ్చాడు. గొడ్డలి పట్టి శరీరశ్రమ చేస్తేనే, నా తప్పులకు ప్రాయశ్చిత్తం జరుగుతుంది. చెట్లను కొట్టవద్దనడానికి, వనదేవత ఎవరు? తమరు వనదేవతను శాసించండి,'' అన్నాడు.

రాజుకు, చమటకుడి మాటలు సబబుగానే తోచాయి. ఆయన, చమటకుడినుంచి

గొడ్డలి తీసుకుని, తానొక్కడూ వృక్షా రణ్యానికి వెళ్ళి వనదేవతను పిలిచాడు.

వనదేవత ప్రత్యక్షమై, రాజు సందేహం విని, "రాజా, నీ ప్రజలను నువ్వు రక్షించు కుంటున్న విధంగా, నేనీ వనాన్ని రక్షించు కుంటున్నాను. ఈ వనంలో ఎన్ని జాతుల వృక్షాలున్నాయో, అన్నింటినీ మరొక స్థలంలో నాటించు. ఇలాంటి వనం మరొకటి తయారయ్యేదాకా వేచివుండు. అప్పుడు మూడోవనానికి ప్రారంభోత్సవం చేసి, ఇక్కడి వృక్షాలను నీ వంట చెరుకుకై ఉపయోగించుకో. అంటే—ఒక వనం నాశనమవుతూంటే, అలాంటిదే మరొకటుండాలి. వేరొకటి ప్రారంభించబడాలి. ఇందుకు నీవంగీకరిస్తే నీకూ, నీ ప్రజలకూ మేలు జరుగుతుంది. లేని పక్షంలో నీ రాజ్యం సర్వనాశనమవుతుంది," అని చెప్పింది.



రాజు మారుమాట్లాడకుండా తిరిగి వెళ్ళిపోయి, చమటకుడితో, "నీవు నీ గొడ్డలినుపయోగించి వృక్షారణ్యాన్ని నాశనం చేయాలనుకుంటే, అందుకు చాలా సంవత్సరాలు ఆగవలసి వుంటుంది. దేశంలో యిప్పటికే ఎందరో కట్టెలు కొట్టుకునేవాళ్ళున్నారు. వాళ్ళకే తగినన్ని చెట్లు లేవు. మా రాజ్యానికవసరమైన కట్టెలను, పొరుగుదేశంనుంచి కొనాలనుకుంటున్నాను. కాబట్టి, నువ్వు మరేదైనా వృత్తినవలంబించు," అని చెప్పాడు.

చమటకుడు, తన కుటుంబంతో సహా పొరుగుదేశానికి వెళ్ళాడు. కట్టెలు కొట్టుకునేందుకు అక్కడ ఎలాంటి ఆంక్షలూ లేవు. వరప్రభావం కారణంగా చమటకుడు, యాభైమంది శ్రమపడి కొట్టే కట్టెలను, తానొక్కడే కొట్టగలిగేవాడు. అందువల్ల క్రమంగా అతడు తిరిగి భాగ్యవంతుడయ్యాడు. తన దేశంలో అంతులేని వృక్ష సంపద వుండి కూడా, హెచ్చు ధరకు పొరుగుదేశంనుంచి కట్టెలు కొనే రాజు తెలివి లేమికి, చమటకుడు నవ్వుకుంటూండేవాడు.



ఈ విధంగా కొన్నేళ్ళు జరిగేసరికి, చమటకుడుంటున్న దేశంలో, ఎన్నడూ ఎరగని కరువువచ్చింది. వర్షాలు లేక ప్రజలు నీటిచుక్కకై తపించిపోయే పరిస్థితి ఏర్పడింది. నీరు లేని కారణంగా పంటలు పండక, ప్రజలు తిండిలేక మలమల మాడిపోసాగారు. క్షామ నివారణ కోసం రాజు యజ్ఞాలు చేయించాడు. ఫలితం లేకపోయింది.

ఏళ్ళు గడిచిన కొద్దీ పరిస్థితులు దిగజారిపోతూంటే, ఆ దేశపు ప్రజలు క్రమక్రమంగా సుభిక్షంగా వున్న ఇతర దేశాలకు వలసపోసాగారు. పేదరికం కారణంగా దొంగతనాలూ, దోపిడీలూ వృద్ధిచెంది, సామాన్యులకు ఏమాత్రం రక్షణలేకుండా పోయింది.

ఈ పరిస్థితుల్లో చమటకుడు కూడా, తిరిగి తన దేశానికి వెళ్లిపోవాలనుకున్నాడు. ఆ సమయంలో అతడికి ఏదో జబ్బుచేసి ముఖంనిండా మచ్చలేర్పడ్డాయి. వైద్యుడు వచ్చి చూసి రోగనిర్ణయం చేయలేక పోయాడు. ఏం చేయాలా అని చమటకుడు బాధపడుతూండగా, రాజభటులు వచ్చి ఆయనను తీసుకుపోయారు. తను చేసిన నేరమేమిటో తెలియకుండా, చమటకుడు వారం రోజులపాటు కారాగారంలో వున్నాడు. కారాగారం నిండా ఆయన లాగే ముఖం నిండా మచ్చలున్నవాళ్ళే వుండడం చూసి ఆశ్చర్యపడ్డాడు.

వారంరోజులు గడిచాక, ఖైదీలందర్నీ ఒకచోట సమావేశపరిచి రాజు, వాళ్ళతో, "అయ్యలారా! మీపట్ల క్రూరంగా ప్రవర్తించినందుకు, నన్ను మన్నించండి. వనాలు నాశనంచేసేముందు కొత్తవనాలను సృష్టించాలని వనదేవత నన్ను హెచ్చరిస్తే, నేను తాత్కాలిక ప్రయోజనం చూసుకుని, ఆ హెచ్చరికను పెడచెవిన పెట్టాను. వనాల కారణంగానే, ఏ దేశంలోనయినా వాతావరణం సక్రమంగా వుంటుంది. వర్షాలు సకాలంలో కురుస్తాయి. మనిషి జీవితం ఏ ఒడిదుడుకులు లేకుండా ప్రశాంతంగా

సాగిపోవాలంటే, వనాలను సంరక్షించుకోవాలి. ఈ విషయం పొరుగు రాజు గుర్తించాడు. అందువల్లనే ఆయన దేశం సుభిక్షంగా వున్నది.

జరిగిందేదో జరిగిపోయింది. ఇకనుంచి మన దేశంలో వనాలను నాశనంచేసేవాళ్ళు శిక్షింపబడతారు. వనాలకు అన్యాయం చేసినవారందరికీ ముఖాలపై మచ్చలేర్పడతాయని, వనదేవత నాకు కలలో కనబడి చెప్పింది,'' అంటూ తన ముఖానికి కప్పుకున్న పల్చటి ముసుగును తొలగించాడు.

తనలాగే రాజుకు కూడా ముఖంనిండా మచ్చలుండడం చూసి, చమటకుడు ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు.

ఆయనకు ఎదురుగా వనదేవత కనిపించింది. ఆమె చిరునవ్వు నవ్వి, ''చమటకా, నా హెచ్చరికను పాటించకుండా వనాలను నాశనం చేస్తే మనుషులు ఎటువంటి కష్టనష్టాలకు గురి అవుతారో చూశావుగదా? నా హెచ్చరికను పాటించని రాజులు కొందరున్నారు. వారి దేశాలే, యీనాటి ఎడారులు!'' అన్నది.

చమటకుడు, వనదేవతకు చేతులు జోడించి, ''అమ్మా, నా కుటుంబ పోషణకు, ఏ వృత్తి అవలంబించమని, నీ ఆజ్ఞ!'' అని అడిగాడు.

''చమటకా, దగ్గిర మహిమగల గొడ్డలి వున్నదని, నువ్వు చెట్లను నరికి కట్టెలమ్మే బ్రతకవలసిన అవసరంలేదు. సాధువు యిచ్చిన వరం వున్నదిగదా! నువ్వు నాగలిపట్టి పొలం దున్ని వ్యవసాయం చేసినా, యితరులకన్న పదింతలు ఎక్కువగా పంటపండించగలవు,'' అని చెప్పింది వనదేవత.

చమటకుడు, తిరిగి గ్రామం చేరాడు. అక్కడ ఆయనకు బీడుగా పడివున్న వ్యవసాయ యోగ్యమైన ఎంతో భూమి కనిపించింది. అక్కడ అతడు వ్యవసాయం ప్రారంభించి, కొద్ది కాలంలోనే దారిద్ర్య బాధనుంచి బయటపడి, భార్యా బిడ్డలతో సుఖంగా జీవించాడు.





# "షరాబులు"

పోలండు దేశస్థులలో ఒక నమ్మకం ఉండేది. అదేమంటే, ఆ దేశంలోని గను లలో మనుషులలాటి భూతా లుండే వారని. వాటిని ''షరాబులు'' అని పిలిచే వాళ్ళు.

ఈ షరాబులు ఎన్నడూ భూగర్భంలో నుంచి పైకి వచ్చేవారుకారు; గనులలో పని చేసేవారితో కలిసి పని చేసేవారు. వాళ్ళు మామూలు మనుషులకన్న చిన్నగా ఉండేవాళ్ళు. మంచి స్వభావాలు గల వాళ్ళకు అనేక విధాల సహాయపడేవాళ్ళు; లోహపు మట్టి తక్కువగా ఉన్న చోట శ్రమపడుతున్నవారికి, సమృద్ధిగా ఉండే ప్రాంతాలు చూపేవారు.

వాళ్ళు చెడ్డవాళ్ళను సహించేవారు కారు; మరీ కోపం వచ్చినప్పుడు వాళ్ళు తవ్వేచోటినుంచి లోహన్ని మాయం చేసి, లోతుకు తీసుకుపోయేవాళ్ళు; లేదా, పై మట్టి విరిగి వాళ్ళ మీద పడేటట్టు చేసే వాళ్ళు.

ఒక ఉప్పు గనిలో ఒక మేస్త్రీ ఉండే వాడు. ఆ గనిలో ఒక పనివాడు చచ్చి పోయినప్పుడు ఆ పనివాడి భార్యకు ఆ మేస్త్రీ పరిహారం చెల్లించక, ఆమె చచ్చి పోయినవాడి భార్య అని తనకు రుజువు లేదన్నాడు. ఆమె చచ్చినవాడి పెళ్ళామే నని ఇతర పనివాళ్ళు సాక్ష్యం చెప్పారు. కాని మేస్త్రీ వినిపించుకోలేదు. తరవాత వారం రోజులకు ఆ మేస్త్రీ ఒక సొరంగం కుండా నడుస్తూ ఉండగా పై కప్పు అతని మీద విరిగిపడి, అతను మరణించాడు.

యుద్ధ సమయాలలో ధనికులు తమ నిధులను ఈ ఉప్పు గనులలోనే దాచే వారట. అలాటి నిధులు కొన్ని శాశ్వతంగా గనులలోనే ఉండిపోయాయి. అవి కూడా షరాబుల రక్షణలోనే ఉండినట్టు చెప్పు

పోలండు జానపద కథ



కునేవారు. వాటికోసం చాలామంది వెతకటానికి ప్రయత్నించారు. కాని అలా వెతుకుతూ ఉండే సమయంలో వారి చేతి దీపాలు అకారణంగా అరిపోతూ ఉండేవి.

ఒకసారి ఒక షరాబు ఇద్దరు గని పనివాళ్ళకు నిధి ఉన్న చోటు చూపిస్తానన్నాడు. షరాబు వెంట పోయేటప్పుడు ఒక పనివాడు ఒక కర్రను చెక్కుతూ, తడపలు కింద రాలుస్తూ వెళ్ళాడు. వాళ్ళు నిధిని కళ్ళారా చూశారు. కాని తిరిగి వచ్చేటప్పుడు చూసుకుంటే, కర్ర పేళ్ళు మాయ మయాయి. అది చూసి రెండో పనివాడు సుద్దముక్కతో దారి వెంబడి గోడలమీద గుర్తులు పెట్టాడు. కాని అవీ మాయమయాయి. అందుచేత ఆ పనివాళ్ళు తాము చూసిన నిధిని మరెన్నడూ కళ్ళ చూడలేదు.

పోలండులో కెల్లా అత్యంత పురాతనమైనదీ, విస్తీర్ణమైనదీ ఒక గని ఉన్నది. అందులో షరాబులు హెచ్చు సంఖ్యలో ఉండేవారు. ఆ గనిని అనేక విభాగాలు చేసి, ఒక్కొక్క విభాగానికీ ఒక్కొక్క షరాబు ఉండేవాడు. ఆ విభాగంలో పని చేసేవారందరినీ ఆ షరాబు కనిపెట్టి ఉండేవాడు. పనివాళ్ళకు ఏదన్నా అన్యాయం జరిగితే తమను కనిపెట్టి ఉండే షరాబు న్యాయం జరిపిస్తాడని వాళ్ళు నమ్మేవారు.

ఒక పేద పని వాడుండేవాడు. వాడు శ్రమపడక, అస్తమానమూ తాగేవాడు. వాడికి మంచి గని ఇచ్చేవారు కారు. ఒక నాడు వాడు ఉదయం నుంచి శ్రమపడినా ఒక్క పిసరు లోహం పడకపోయేసరికి, ఒక బండరాతి మీద కూర్చుని, "నేను ఎలాటి దరిద్రుణ్ణి! నాకెవరి సహాయమూ లేదు. ఇలాటి చోట ఎంత శ్రమించి ఏం లాభం?" అని వాపోసాగాడు.

ఒక షరాబు వాణ్ణి పలకరించి, "నువు చేసుకోవటానికి ఇచ్చిన చోటంతా కలిపి ఇదేనా?" అని అడిగాడు.

"ఇంతకన్న మంచి చోటు నాకెవరిస్తారు?" అన్నాడు పనివాడు దీనంగా.



''ఇక్కడి గనిలో సత్తు తప్ప ఏమీ లేదు. వెండి ఏనాడో వట్టిపోయింది. వెండి ఉన్నదంటున్నావు గనక, అదంతా నువే తవ్వుకో!'' అని వాళ్ళు యద్దేవా చేశారు.

కాని ఆ పనివాడు తాగుడు ఆలోచన కట్టిపెట్టి, ఒక నెల అంతా ముడివెండి తవ్వి, తన కూలి కింద అనేక వేల నాణాలు సంపాదించుకున్నాడు. ఆ నాణాలను ఒక తోపుడు తొట్టెలో పోసుకుని, మొదట తాను షరాబును కలుసుకున్న చోటికి వచ్చాడు. షరాబు వాడికోసం సిద్ధంగా ఉన్నాడు.

నాణాలు సమంగా పంచగా ఒక నాణెం మిగిలిపోయింది.

''ఈ చివరి నాణెం ఎవరికి?'' అని షరాబు అడిగాడు.

''అది నువే తీసుకో, బాబూ!'' అన్నాడు పనివాడు.

''నీకు డబ్బు కాపీనం పట్టలేదన్న మాట. అంతా నువే ఉంచుకో. కాని దానధర్మాలు చెయ్యటం మరవకు,'' అని చెప్పి షరాబు వెళ్ళిపోయాడు.

పనివాడు జీవితాంతం దాకా దానధర్మాలు చేస్తూ, తాగుడు మానేసి, సుఖంగా జీవించాడు.

అదే గనిలో ఇంతకన్న విచిత్రమైన సంఘటన మరొకటి జరిగింది. ఇది

''నా వెంట రా. నీకు వెండిలోహం దొరికే చోటు చూపిస్తాను. నేను చెప్పినట్టు వింటే నీకు మంచి లాభం వస్తుంది.'' అన్నాడు షరాబు.

పనివాడు షరాబు వెంట ఒక ప్రాంతానికి వెళ్ళాడు. ''ఇదుగో వెండి. నీకు కావలిసినంత తవ్వుకో. నువు తవ్విన వెండి తూయించి, నీకు రావలసినది తీసుకున్న తరవాత, మనం మొదట కలుసుకున్న చోటికి రా. అక్కడ మనం డబ్బు పంచుకుందాం," అన్నాడు షరాబు.

పనివాడు సంతోషంగా తోటి పనివాళ్ళ వద్దకు వెళ్ళి, బోలెడు ముడి వెండి ఉన్నది, తవ్వటానికి రమ్మన్నాడు.

జరిగినది కూడా ఆ గనిలోని ఒంటరి పని వాడికే.

ఒకనాడు వాడి కొక షరాబు కనిపించి, "ఒంటరిగా పని చేస్తున్నావేం? నన్ను భాగస్తుడుగా కలుపుకుంటావా?" అన్నాడు.

దాని కా పనివాడు, "ఇందులో లోహం తక్కువ. ఒక్కడికే కడుపు నిండదు. ఇద్దరం ఏం తింటాం?" అన్నాడు.

"మంచి చోటు నేను చూపిస్తాను. నా వెంట రా!" అంటూ షరాబు ఆ పని వాణ్ణి మరొక ప్రాంతానికి తీసుకుపోయాడు. అక్కడ ముడిలోహం పుష్కలంగా ఉన్నది. పనివాడు ఉత్సాహంగా దాన్ని తవ్వనారంభించాడు. కొద్దిసేపు అయ్యాక షరాబు వాణ్ణి భూగర్భంలో ఇంకా లోతుకు తీసుకుపోయాడు.

పనివాడు అలిసిపోయి, కాస్సేపు విశ్రాంతి తీసుకుంటానన్నాడు. అతను తన వద్ద ఉన్న రొట్టె తిని, నడుము వాల్చి కునుకు తీశాడు.

అతను నిద్ర లేచేసరికి షరాబు అక్కడే ఉండి, "ఎంతసేపు నిద్రపోయావో తెలుసా?" అని అడిగాడు.

"రెండు గంటలు పడుకుని ఉంటానేమో!" అన్నాడు పనివాడు.

షరాబు ఏమీ అనక, అతన్ని మరొక మార్గాన మొదటి చోటుకు తీసుకు వచ్చి,



కొంత డబ్బిచ్చి, "ఊళ్ళోకి వెళ్ళి రొట్టె పట్టుకురా," అన్నాడు.

పనివాడు తిరిగి నేలమీదికి రాగానే అక్కడ పని చేస్తున్న నలుగురు ఆడ కూలీలు అతన్ని చూడగానే బెదిరి, పారిపోయారు. పనివాడు వాళ్లను తిట్టుకుంటూ ఊళ్ళోకి వెళ్ళాడు. కాని ఊరు గుర్తు పట్టేటట్టులేదు. ఆఖరుకు తానూ, తన తల్లిదండ్రులూ ఉండే ఇల్లు గాని, కనీసం ఆ ఇల్లు ఉండే వీధి గాని పోల్చటం వాడికి సాధ్యం కాలేదు. వాడు ఒక అంగడికి పోయి, తన వద్ద ఉన్న డబ్బులిచ్చి రొట్టె ఇయ్యమంటే, అంగడివాడు ఆ డబ్బులు చెల్లవన్నాడు. ఆ దుకాణం వద్ద ఉన్న

పెద్ద మనిషి ఆ డబ్బులు పరీక్షించి, నూరేళ్ళనాటివని చెప్పాడు.

తాను ఒక నూరేళ్ళు నిద్రపోయి ఉండాలని పనివాడికి అర్థమయింది! వాడు గనిలోకి తిరిగి వెళ్ళి షరాబుతో, ''నేను నూరేళ్ళు నిద్రపోయినట్టున్నాను. ఇప్పుడు నా గతి ఏం కాను?'' అన్నాడు.

''అదంతా ఏమీ లేదు. నువు ఊళ్ళోకి తిరిగి వెళ్ళు. నువు మహా నిద్రపోతే రెండేళ్ళకు పైన నిద్రపోయి ఉండవు. సరిగా ఏడాదికి మళ్ళీ వచ్చి కనబడు. నేనిక్కడే ఉంటాను,'' అన్నాడు షరాబు, పనివాడికి కొంత బంగారం ఇస్తూ.

పనివాడు ఈసారి తిన్నగా ఇంటికి వెళ్ళగలిగాడు. కాని వాడు తన అనుభవాలు చెబితే, వాడి భార్య గాని, పిల్లలు గాని, స్నేహితులు గాని నమ్మలేదు.

సంవత్సరం గడిచాక పనివాడు మళ్ళీ గనిలోకి దిగి, షరాబును కలుసుకున్నాడు.

''ఈసారి నీకు ఏకంగా నిధినిక్షేపం చూపిస్తాను. నా వెంట రా!'' అంటూ దారి లేని దారి వెంట, పాడుబడిన సొరంగాల కుండా చాలా దూరం తీసుకుపోయాడు. చివరకు వాళ్ళు చేరిన చోట అంతులేని నిధు లున్నాయి.

''ఇదంతా ఒకప్పుడు భూమికి దగ్గిరగా ఉండేది. పనివాళ్ళు సుఖువుగా తవ్వితీసుకునేవాళ్ళు. కాని తేరగా వచ్చిన డబ్బుతో మనుషులు మదించిపోయారు. అందుకు శిక్షగా ఈ నిధి అంతా భూగర్భంలోకి దిగి వచ్చేసింది. నువు పట్టుకు పోగలిగినంత పట్టుకుపోయి సుఖంగా ఉండు,'' అన్నాడు షరాబు.

''ఈ నిధిని గురించి నేను నలుగురికీ చెప్పవచ్చునా?'' అని పనివాడు అడిగాడు.

''చెబితే చెప్పు. పలుగులూ, పారలూ తెచ్చి తవ్వుకుపొమ్మని కూడా చెప్పు.'' అన్నాడు షరాబు.

కాని, పనివాడికి పట్టిన ఐశ్వర్యం చూసి, వాళ్ళు కూడా వాడు చెప్పిన కథ నమ్మలేదు. ఆ నిధిని కనుక్కున్నవారు ఆ తరవాత ఎవరూ లేరు.



## పొడవైన కోరలు

పశ్చిమ ఆఫ్రికాలోని గాబూన్ వైవర్ విష సర్పాలకు 1¾ అంగుళాల పొడవు గల కోరలు ఉన్నాయి.






మసెల్ అనే నత్తగుల్ల, మొదట కాలులాగా కనిపించే కండరాన్ని (ఇది మామూలుగా గుల్లలోపల వుంటుంది) ముందుకుసాచి, ఆ తరవాత గుల్లతోపాటు శరీరాన్ని పాదం వరకు ముందుకు తీసుకు పోతుంది।

## ప్రకృతి వింతలు:




మధ్య, దక్షిణ అమెరికాలో నివసించే స్పైడర్‌మంకీ అనే కోతికి మూడవ చేయి లాగా ఉపయోగపడే పొడవాటి తోక ఉన్నది. తోక కొన లోపలివైపు రోమాలు లేకుండా కండరాలతో నిండి వుండడంవల్ల, దానితో కొమ్మలను వడిసి పట్టుకోగలుగుతున్నది।

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1989 జనవరి నెల సంచికలో ప్రకటింపబడును.



S. B. Takalkar



S. M. Dudhediya

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ నవంబర్ నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: నిత్యకృత్యానికి
రెండవ ఫోటో: నిరీక్షణ ఎందుకో?

పంపినవారు: పి. సత్యనారాయణ, తాడితోట, రాజమండ్రి (ఆం. ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.




Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


---